

ఇది సబీనా లేదా ప్రియా?

# రస్న ఏదో, నేను కళ్ళు మూసుకుని చెప్పగలను.

దాగుడు మూతలు ఎప్పుడు ఆడినా ఓడేది నేనే. అంచేత, ఇప్పుడు నేను ఏం చేస్తానో తెలుసా? నేను కళ్ళు మూసుకుంటాను, అన్నయ్య వేర్వేరు




ఆరెంజ్ డ్రింక్‌లు నాకు అందిస్తాడు. నేను ఒక్కొక్కదాన్నే రుచి చూస్తాను. అన్నిటికన్నా రుచిగా వున్నది రాగానే నాకు తెలిసిపోతుంది... మ్‌మ్‌మ్... అదే నా రస్న!

ఆరెంజ్ □ పైనాపిల్ □ లైమ్ □ షాహీ గులాబ్ □ కాలా ఖట్టా □ కూల్ ఖస్ □ కేసర్ ఇలైచి □ మసాలా సోడా (జల్ జీరా) □ టూటీ ఫ్రూటీ □ మేంగో రైప్ □ గ్రేప్ గోర్

## తాజాదనం చిందించే రస్న

11 పసందైన రుచులు సరసమైన ధరలో.



తాగు...తాగు...అన్నిటికన్నా రుచిగా వున్నదిఏది?



ఉమ్‌మ్‌మ్...సందేహంలేదు రస్న ఇదే!

Mudra:A:EAMR:5161 Tel

# In a class of its own

*Exclusive pencils for one and all,*

**LION PREMIER® HB PENCILS**

Sleek, Elegant, meant for executives and others, who like style A consistent dark tone for effortless writing - micronized lead for unbreakable points are what adds to its superiority.



**LION PINKY® PENCILS**

Lion 'PINKY' Pencils Pretty Perfect, Ideal for children because of its pretty designs & colours.Strongly bonded lead for unbreakable points and super smooth writing add to its attraction.



**LION Geematic® DRAWING PENCILS**

Lion Geematic Drawing Pencils. A unit for all Professionals like artists, architects, designers & engineers. Give expertise an edge. Available in 14 grades from H to 6H and B to 6B HB and F





**LION PENCILS LTD**
95, Parijat, Marine Drive
BOMBAY 400 002

National-356




# మేగీ క్లబ్: రండి, అడవుల్లో సరదా విహారానికి!




## ఉచితం!

మీ బహుమతులను పొందండి

మీరు మేగీ నూడుల్స్ యొక్క అయిదు ఖాళీ సంచులకు ముందు వైపున ముద్రించబడి ఉండే యీ [MAGGI 2-Minute] ను కత్తిరించి, మీరు ఎంచుకున్న ప్రతి ఉచిత బహుమతి కోసం వాటిని మాకు పంపించండి. అంతే! మీకు 6 నుంచి 8 వారాలలో మేగీ క్లబ్ నుంచి ఎంతో వినోదాన్ని, ఉత్సాహాన్ని కలిగించే బహుమతి అందుతుంది!

మర్చిపోకండి:
మీరు మేగీ క్లబ్ సభ్యులు కాని పక్షంలో, మీరు మాకు లేఖ వ్రాసినప్పుడు మీకు కావలసిన బహుమతి పేరుతోపాటు మీ పేరు, చిరునామా పంపించండి. మీరు మేగీ క్లబ్ సభ్యులై ఉంటే, మీ సభ్యత్వపు నంబరు పంపించండి.






ఫారెస్ట్ ఫేసెస్ కేప్స్ మరియు మాస్క్

మా చిరునామా:
మేగీ క్లబ్ పి.బి. బాక్స్ 5788, న్యూ ఢిల్లీ:110055

మరొక సదుపాయం కూడా:
మీరు యింతవరకు ట్రావెల్ ఇండియా గేమ్ యింకా సేకరించి ఉండకపోతే, యిప్పుడు సేకరించండి!




HTA 6678 TEL

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'     సంచాలకుడు : నాగిరెడ్డి

## దురలవాటును మానండి!

పొగతాగడం ఆరోగ్యానికి హానికరం అనడం నిర్వివాద విషయం. ఇది డబ్బునుమాత్రమే కాదు; మనిషి ఆయుఃప్రమాణాన్ని కూడా హరించేస్తుంది. అంతేకాదు; సిగరెట్లు కాల్చడం మొదట ఆనందాన్నిస్తున్నట్టు అనిపించినా, అది చివరిదశలో శ్వాశకోశాలనూ, గొంతునూ పాడుచేసి, రకరకాల వ్యాధులకు కారణమై, మొదట ఇచ్చిన ఆనందానికి వెయ్యిరెట్లు ఎక్కువ బాధను కలిగిస్తుంది!

ఆధునికకాలంలో పెరిగిపోతూన్న వేగాన్నీ, మానసికమైన ఒత్తిడనీ తట్టుకోవాలంటే సిగరెట్లు కాల్చడం అనివార్యమవుతున్నదని కొందరు వాదిస్తూ వుంటారు. అయితే, ఇది నిజం కాదు. ఎందుకంటే జీవితం అత్యంతవేగంగా నడుస్తూన్న అమెరికాలోనే ఇవాళ పొగ పీల్చే అలవాటు తగ్గుముఖం పడుతున్నది. అయితే, సిగరెట్ల ఎగుమతి మాత్రం అమెరికా నుంచే అత్యధికంగా జరుగుతున్నది. అదీ వ్యాపారం అంటే!

ఆస్పత్రులలో, విద్యాలయాలలో, ఎయిర్ కండిషన్ చేసిన రైలు పెట్టెలలో, విమానాలలో పొగతాగడం నిషేధించాలని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించడం ఎంతయినా ప్రశంసించతగ్గ విషయం. ఈ ప్రయత్నం ఫలప్రదం కావడానికి ప్రతి ఒక్కరూ సాయపడాలి. ముఖ్యంగా ఉపాధ్యాయులు ఈ దురలవాటుకు స్వస్తిచెప్పి విద్యార్థులకు మార్గదర్శకులు కావాలి!

సంపుటి 86     జూన్ '90     సంచిక 6

విడి ప్రతి : 3-00     : :     సంవత్సర చందా : 36-00






అనందంగా ఆడేటప్పుడు,
వినోదంగా పాడేటప్పుడు...

## ఫన్‌బైట్ మటుకే మీ సంతోషానికి సంపూర్ణత కలిగిస్తుంది




భారతదేశపు అతిపెద్ద అత్యాధునిక కర్మాగారం నుండి

క్యాంప్కో అందిస్తున్న ఫన్‌బైట్ సమృద్ధికరమైన క్రీమ్ చాక్లెట్. కరకరలాడే వెఫర్ లోపల. రుచి కరమైన చాక్లెట్ వెలుపల వినోద సమయాలకి మరింత వినోదం తెస్తుంది.

క్యాంప్కో లిమిటెడ్, మంగళూరు.

Other Campco chocolates: Milk / White / Treat / TURBO / Eclairs / Mega bite / Playtime / RUBIES / TOFFEE

Campco beverages: WINNER / COCOA

R K SWAMY/CL/7804/TEL

# నేపాల్‌లో ప్రజాస్వామ్యం!

హిమాలయ పర్వత దక్షిణ సానువుల నానుకుని నేపాల్ దేశం విస్తరించి ఉన్నది. మన దేశానికి ఉత్తర సరిహద్దులో వున్న నేపాల్‌కు పశ్చిమంగా సట్లజ్ నది ప్రవహిస్తున్నది. తూర్పున సిక్కిం సరిహద్దుగా వుంటున్నది. దాదాపు ఒకటిన్నర కోట్ల జనాభా గల నేపాల్ రాజధాని ఖాట్మండు.

నేపాల్‌లో హిందువులూ, బౌద్ధులూ అధిక సంఖ్యాకులుగా వుంటున్నారు. మరొక పొరుగు రాజ్యమైన చైనా కన్నా, ఇండియాతో నేపాల్ ప్రజలు సన్నిహిత సంబంధాలు కలిగివున్నారు. ఈ సంబంధం ఈనాటిది కాదు; అతి ప్రాచీనమైనది. ఎందుకంటే—అశోక చక్రవర్తి కాలంలోనూ, సముద్రగుప్తుడి కాలంలోనూ, నేపాల్ భారత సామ్రాజ్యంలో అంతర్భాగంగా వుండేది!

1846 నుంచి 1951 వరకు నేపాల్‌ను రాజులు పరిపాలించలేదు. వంశపారంపర్యంగా వచ్చిన ప్రధాన మంత్రులు రాణాల పేరుతో పాలన సాగించారు.

1951 వ సం॥లో రాణాలకు వ్యతిరేకంగా ప్రజా ఉద్యమం బయలుదేరింది. రాణాలనుంచి, రాజు మళ్ళీ అధికారాన్ని చేజిక్కించుకున్నాడు. అయినా, ప్రజాస్వామ్య ప్రభుత్వం కావాలని ప్రజలు ఆందోళన కొనసాగించారు. అప్పుడప్పుడూ మంత్రులను ఎన్నుకునేవారు. అయినా, ఆ మంత్రులు అట్టేకాలం కొనసాగేవారు కారు. పైగా, ఏ విషయంలోనైనా సరే, నిర్ణయాధికారం రాజుకే ఉండేది.

1961 లో రాజు మహేంద్ర పార్టీ రహిత శాసనసభ 'రాష్ట్రీయ పంచాయత్' పద్ధతిని ప్రవేశపెట్టాడు. కాని, ఇది ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబించలేక పోయింది; ప్రజల సమస్యలను పరిష్కరించలేకపోయింది. అందువల్ల, ప్రజలు ఏకరాజాధిపత్యాన్ని మాత్రమే కాకుండా, ప్రయోజనం లేని పార్టీరహిత 'రాష్ట్రీయపంచాయత్'ను కూడా వ్యతిరేకించవలసిన పరిస్థితి ఏర్పడింది.

1972 లో రాజుమహేంద్ర మరణించడంతో ఆయన కుమారుడు రాజు బీరేంద్ర రాజ్యాధికారానికి వచ్చాడు.




ఆఖరికి ఆయన ప్రజాభీష్టాన్ని నెరవేర్చి, ప్రజాస్వామ్యాన్ని ప్రవేశపెట్టడానికి విజ్ఞతతో అంగీకరించాడు. ఆయన తీసుకున్న నిర్ణయం ఎంతయినా ప్రశంసించతగిన విషయం! ఆయన త్వరలో బ్రిటిష్ రాణి లాగా, కేవలం అలంకార ప్రాయమైన 'రాజు' పదవిని అలంకరించవచ్చు.

ప్రస్తుతం నేపాల్ ప్రజలు తమ చిరకాల వాంఛను సాధించామన్న విజయోత్సాహంతో ఉన్నారు. ఇక మీదట, నేపాల్ ప్రజలు తమ నూతన హక్కులను వినియోగించుకునే పద్ధతిని అనుసరించి, ప్రజానాయకులు వారిని నడిపించే దిశనుబట్టి వారి భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది!




# సన్మానానికి అర్హులు

లక్ష్మీపురం గ్రామంలో సమధర్ముడనే న్యాయాధిపతి, ప్రభుత్వం తరఫున రాజోద్యోగిగా పని చేస్తూండేవాడు. సమధర్ముడు న్యాయశాస్త్రం, నీతిశాస్త్రం క్షుణ్ణంగా చదివినవాడూ, గొప్ప విజ్ఞత వున్నవాడూ కావడంతో, తీర్పులు చెప్పడంలో తనకు తనే సాటిగా పేరు పొందాడు.

ఈ సంగతి క్రమంగా ఆ దేశపురాజు శూరవర్మకు తెలిసింది. ఆయన సమధర్ముణ్ణి సన్మానించాలనుకున్నాడు. అందుకు తగిన ఏర్పాట్లు జరిగాక, రాజు నుంచి సమధర్ముడికి వర్తమానం అందింది. ఆయన సన్మానాలంటే ఇష్టం లేనివాడయినప్పటికీ, రాజు అడిగినప్పుడు కాదనడం భావ్యంగా వుండదని, వెంటనే రాజధానికి బయలుదేరాడు.

దారిలో సమధర్ముడికి, రామయ్య అనే పేదరైతు ఎదురయ్యాడు. అతడు కూడా లక్ష్మీపుర గ్రామస్థుడే. కొన్ని దినాల క్రితం అతడి పొలాన్ని ఆ గ్రామంలోని భైరవయ్య అనే పెద్ద రైతు, రామయ్య తాత ముత్తాతలు తనవద్ద అప్పుచేశారని, ఏవో దొంగపత్రాలు చూపించి ఆక్రమించుకున్నాడు.

రామయ్య, న్యాయాధిపతి సమధర్ముడి వద్ద ఫిర్యాదు చేశాడు. సమధర్ముడు, భైరవయ్య చూపించిన పత్రాలు పరిశీలించి, అవి దొంగపత్రాలని గ్రహించి, రామయ్య పొలాన్ని అతడికి తిరిగి స్వాధీనం చేయమని తీర్పు యిచ్చాడు.

దారిలో సమధర్ముడు, రామయ్యను చూస్తూనే, "ఏం, రామయ్యా! కులాసాయేనా?" అంటూ కుశలమడిగాడు.

అందుకు రామయ్య, "ఏదో బాగానే వున్నాను, బాబూ, ఆ జగపతిబాబు దయ వల్ల!" అన్నాడు.

భీమవరపు పురుషోత్తం



ఇది విని సమధర్ముడు ఆశ్చర్యంగా, ''జమీందారు జగపతివర్మగారు, నీకేమైనా సహాయం చేశారా ?'' అని అడిగాడు.

రామయ్య ఒక్క క్షణం పూరుకుని, ''సహాయం అని మెల్లగా అంటారేం, బాబూ ! ఈ రోజు నేనూ, నా కుటుంబం ఇంత తిండి తింటున్నామంటే, అది జగపతివర్మగారి చలవే.. ఉన్న పొలం కాస్తా పోయి దిక్కు లేనివాళ్ళమయిన మాకు, ఆయన కరుణించి తన పొలం లోని రెండెకరాలు దానంగా ఇచ్చాడు. ఆ పొలం పండించుకునే ఇప్పుడు భార్యా పిల్లల్ని పోషించుకోగలుగుతున్నాను,'' అన్నాడు.

ఇది విని సమధర్ముడు మరింతగా ఆశ్చర్యపోయి, ''అదేమిటి ! భైరవయ్య దొంగపత్రాలు చూపి లాక్కున్న నీ పొలాన్ని, నీకే చెందాలని తీర్పు ఇచ్చాగదా ?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు రామయ్య పేలవంగా నవ్వి, ''తీర్పుదేముంది, బాబూ ! అది అమలు జరగవద్దా ?'' అని ముందుకు సాగిపోయాడు.

రామయ్య చెప్పింది విన్న సమధర్ముడు ఒక్క క్షణం నిశ్చేష్టుడయ్యాడు. బాగా ఆలోచించిన మీదట ఒక విషయం అతడికి అర్థమైంది.

సమధర్ముడు రాజధాని చేరాక, రాజు ఆయనకు సన్మానం చేయడానికి సింహాసనం దగ్గరకు రావలసిందిగా ఆహ్వానించాడు. ఈ సన్మానం చూడడానికి, లక్ష్మీపురం గ్రామం నుంచి కూడా చాలామంది వచ్చారు. వాళ్ళల్లో జమీందారు జగపతివర్మ కూడా వుండడం, సమధర్ముడు గమనించాడు.

ఆయన వెంటనే రాజుతో, ''మహారాజా, ఈ సన్మానానికి అంగీకరించనందుకు, నన్ను క్షమించండి. మా గ్రామంలో న్యాయమైన తీర్పులిస్తున్నందుకు, న్యాయాధిపతినైన నాకు, తమరు సన్మానం జరపబోతున్నారు. కాని, ఈ సన్మానం నాకు

కాదు. అదుగో, జమీందారు జగపతిగారే, ఈ సన్మానానికి అర్హులు! వారిని సన్మానించండి,'' అన్నాడు.

ఇది విని సభలో వున్నవారితోబాటు, జమీందారు జగపతివర్మ కూడా తెల్లబోయాడు. రాజు, సమధర్ముడికేసి ఆశ్చర్యంగా చూశాడు.

అప్పుడు సమధర్ముడు, రాజుతో, ''అవును, మహారాజా! నేను చెప్పిన దానిలో వింత ఏమీలేదు!'' అంటూ, తనకు దారిలో రామయ్య ఎదురుకావడం దగ్గిరనుంచీ, అతడికీ, తనకూ జరిగిన సంభాషణ అంతా చెప్పి, ''ఎంతచిత్రమో చూశారా, ప్రభూ! న్యాయాధిపతిగా నేను, న్యాయమైన తీర్పులు మాత్రమే ఇవ్వగలుగుతున్నాను. అయితే, కొందరు లంచగొండులూ, అవినీతిపరులైన రాజోద్యోగులవల్ల, ఆ తీర్పులు అమలుకావడం లేదు. కాని ఉదారుడైన జమీందారు జగపతివర్మగారు మాత్రం, ఈ న్యాయస్థానాలకూ, తీర్పులకూ అతీతంగా వుంటూ, తాతముత్తాతల నుంచి వస్తున్న ఉదార స్వభావంవల్ల, గ్రామంలో పేదప్రజలకూ, దగాపడ్డవాళ్ళకూ, తనకు వీలైనంతలో సహాయాలూ, గుప్తదానాలూ చేస్తూ, వాళ్ళను ఆదుకుంటున్నారు. ఇప్పుడు చెప్పండి, మహారాజా! ఈ సన్మానం ఎవరికి జరగాలి? నాకా? జగపతివర్మ గారికా?'' అని ప్రశ్నించాడు.

అంతా విన్న రాజు శూరవర్మ చలించిపోయి, ''నువ్వు చెప్పిందే నిజం. జగపతివర్మే ఈ సన్మానానికి అర్హుడు. అయినప్పటికీ నీ న్యాయబుద్ధి, రాజ్యంలో జరుగుతున్న ఒక అకృత్యాన్ని తెలియజేసి, మా కళ్ళు తెరిపించినందుకు, నువ్వూ సన్మానానికి అర్హుడివే!'' అని సన్మానం ఇద్దరికీ జరిపించాడు.

తర్వాత రాజు సుశిక్షితులైన వేగుల సహాయంతో, రాజ్యంలోని అవినీతిపరులందరినీ బంధించి, మళ్ళీ అలాంటి అవినీతిపరులు తలెత్తకుండా తగిన శాసనాలు చేసి, కఠినంగా అమలు జరిపాడు.





# ముగ్గురుబానిసలు

బొగ్దాదులోని ఒక గొప్ప బిడారి వర్తకుడి దగ్గిర, ముగ్గురు బానిసలుండేవారు. వాళ్ళల్లో ఒకడు వర్తకుడికి రాత్రితెల్లవార్లూ కాళ్ళు పట్టాలి. మరొకడు ఇరవైఅడుగుల పైగా లోతున్న బావిలోంచి నీళ్ళు తోడి, వర్తకుడుంటున్న భవనానికి నీళ్ళ కొరత లేకుండా చూడాలి. మూడోవాడు వర్తకుడి భవనానికి అవసరమయ్యే సామగ్రిని, స్వయంగా వీపుమీద పెట్టుకుని మోసుకు రావాలి.

ముగ్గురు బానిసలు చేసేదీ వెట్టిచాకిరీ అయినప్పటికీ, వాళ్ళు ఏనాడూ వర్తకుడి ఔదార్యానికి నోచుకోలేదు. పైగా, చేసే వెట్టిచాకిరీకి ఫలితంగా, వాళ్ళకు రోజూ కడుపునిండా సరిఅయిన తిండి కూడా లభించేదికాదు.

వర్తకుడికి పెళ్ళయి చాలా కాలం అయినప్పటికీ, సంతానం కలగలేదు. ఆ తర్వాత కొన్నేళ్ళకు వర్తకుడి అదృష్టం పండి, అతడి భార్య పండంటి మగపిల్ల వాణ్ణి కన్నది. ఇక వర్తకుడికీ, అతడి బంధుమిత్రులకూ కలిగిన ఆనందం అంతాయింతా కాదు.

వర్తకుడు వారంరోజులపాటు, అందరినీ విందు వినోదాలతో ఆనందపరిచాడు. బీదలకు అన్నదానం, వస్త్రదానం చేశాడు. నగరంలో నాలుగు బాటలూ కలిసే చోట పెద్దసత్రం ఒకటి కట్టించాడు.

ఇన్ని చేశాక వర్తకుడికి ఒక ఆలోచన వచ్చింది. అతడు తన ముగ్గురు బానిసలనూ పిలిచి, వాళ్ళతో ఎంతో ఆప్యాయంగా, "మీరెంతోకాలంగా, నా దగ్గిర నమ్మకంగా సేవచేస్తున్నారు. నాకు లేకలేక కుమారుడు కలిగిన, ఈ శుభ సందర్భంలో, మీకు నాచేతనైన మేలు చేయదలిచాను. ఈ రోజున మీ ముగ్గురిలో ఎవరు బాగా పని

రాంబాబు

చేసి, నన్ను తృప్తిపరుస్తారో, వాళ్ళను బానిసత్వం నుంచి విముక్తుల్ని చేయ దలిచాను,'' అని చెప్పాడు.

ఆరోజు మూడవవాడు, వర్తకుడి భవనానికి విపరీతమైన బరువులు మోశాడు. అంతేకాక, రాత్రి కూడా నిద్రపోకుండా తెల్లవార్లూ వర్తకుడి ఇంటికి ఏవో సామాన్లు చేరవేస్తూనే వున్నాడు.

ఇక రెండవ బానిస బావిలోంచి రాత్రీ, పగలూ అవసరాన్నిమించి నీళ్ళు తోడుతూనే వున్నాడు. ఆవిధంగా బానిసలిద్దరూ, తమ శక్తికిమించి పనిచేయడంవల్ల, బాగా అలసిపోయి సొమ్మసిల్లి పడిపోయే పరిస్థితికి వచ్చారు.

అయితే, మొదటిబానిస మాత్రంఆరోజు వర్తకుడి కాళ్ళు పట్టడానికి వెళ్ళలేదు. వర్తకుడు చాలాసేపు వాడికోసం చూసి, ఇక కోపం పట్టలేక, వాణ్ణి కాళ్ళూ, చేతులూ కట్టి తనవద్దకు తీసుకురావలసిందిగా నౌకర్లకు ఆజ్ఞ యిచ్చాడు.

కొద్దిసేపట్లోనే వర్తకుడి నౌకర్లు, మొదటి బానిసకాళ్ళూ, చేతులూ తాళ్ళతో కట్టి మోసుకువచ్చి, అతడి ముందు పడవేశారు.

వర్తకుడు, నౌకర్లను, ''వీడు ఎక్కడున్నాడు? ఏం చేస్తున్నాడు?'' అని అడిగాడు.



అందుకు నౌకర్లు, ఆ బానిస వంటశాలలో సుఖంగా నిద్రపోతున్నట్టు చెప్పారు.

''మిగతా ఇద్దరు బానిసలేం చేస్తున్నారు?'' అని ప్రశ్నించాడు వర్తకుడు కోపంగా.

వర్తకుడి నౌకర్లు పోయి, సొమ్మసిల్లి పడివున్న ఇద్దరు బానిసలనూ తెచ్చి, అతడి ముందు నిలబెట్టారు.

వర్తకుడు, నౌకర్లను, ''వీళ్ళిద్దరూ ఏం చేస్తూండగా, నా దగ్గిరకు తీసుకువచ్చారు?'' అని అడిగాడు.

''అయ్యా, వీళ్ళు ఈ రోజున ఒకక్షణం కూడా విశ్రాంతి తీసుకోకుండా తమ శక్తి

మించి, పని చేశారు. అందువల్ల స్పృహ కోల్పోయే స్థితికి వచ్చారు," అని జవాబిచ్చారు నౌకర్లు.

వర్తకుడు ఇది విని చాలా సంతోషించి, వాళ్ళ ముఖాల మీద చన్నీళ్ళు చల్లించి, "ఆహాఁ, యజమాని మీద ఎంతో భక్తి గౌరవాలతో రాత్రనక, పగలనక కష్టపడి పనిచేసే బానిసలు బహు అరుదు. ఈ క్షణం నుంచీ మీరిద్దరూ బానిసలు కారు; స్వతంత్రులు. మీరిక నుంచీ స్వేచ్ఛగా బతకవచ్చు," అన్నాడు.

ఆ తర్వాత వర్తకుడు, మొదటి బానిస కేసి చూస్తూ, "ఒరే, నేను నీకిచ్చిన అవకాశాన్ని చేజేతులా దుర్వినియోగం చేసుకున్నావు. నీవంటి మందమతీ, సోమరిపోతూ మరొకడుండడు. ఇంతకూ, నీకు ఈ బానిసత్వం నుంచి విముక్తి పొంది స్వేచ్ఛగా జీవించాలన్న ఆశలేదా ?" అని అడిగాడు.

ఇందుకు మొదటి బానిస కళ్ళనీళ్ళు పెట్టుకుని, "అయ్యా, నేను బతికున్నంత వరకూ, తమకు సేవచేస్తూ వుండాలన్నదే, నా ఆశ. అందువల్ల, మిమ్మల్ని వదిలి పోవడం, నాకేమాత్రం ఇష్టం లేదు. ఆ కారణంవల్లనే, మీరు అవకాశం కల్పించినా ఈ రోజంతా తమ దగ్గిరకు రాకుండా వుండి, తమ ఆగ్రహానికి గురై, శాశ్వతంగా మీ దగ్గిరే బానిసగా బతకదలిచాను." అన్నాడు.

వర్తకుడు వాడి మాటలకు పరమానందం చెంది, "అదా నువ్వు కాళ్ళు పట్టేందుకు, నా దగ్గిరకురాని కారణం! నీ స్వామి భక్తికి మెచ్చాను. నిన్ను ఈ క్షణంనుంచే బానిసత్వం నుంచి విముక్తి చేస్తున్నాను. అయితే, నన్నువదిలి ఎక్కడికైనా పోవడం, నీకిష్టంలేదు కనక, ఈరోజునుంచి నా కొలువులోనే నీకు మంచి ఉద్యోగం ఒకటి యిస్తున్నాను," అన్నాడు.

ఇందుకు బానిస చాలా సంతోషించి, మిగిలిన జీవితకాలాన్ని వర్తకుడి కొలువులోనే గడిపాడు.






## 10

[అమృతపురిమీదికి దండెత్తిన వీరసింహుడి సేనలు, హఠాత్తుగా సుమతీ నదిలో వచ్చిన జలప్రవాహంలో కొట్టుకుపోయాయి. కొత్తగా సైన్యాన్ని సమీకరించడానికి పూనుకుని, అయుధ సేకరణకు అవసరమైన ధాన్యాన్ని రైతులనుంచి వసూలు చేయమని వీరసింహుడు కపాలకంఠుణ్ణి ఆదేశించాడు. అయినా, ప్రజలలో తీవ్రమైన వ్యతిరేకత ఏర్పడింది.—తరవాత]

వసంతరుతువు రాకతో అరణ్యం సరికొత్త అందాలను సంతరించుకున్నది. పచ్చని చెట్టుచేమలపై పువ్వులు వింతవింత రంగులను సృష్టించాయి. ఎటు విన్నా కోకిల పాటలు; చిలుకల కిలకిలలు వీనుల విందు చేయసాగాయి!

శాంతిపుర యువరాజు అడవిలో అడుగుపెట్టినప్పటినుంచీ వసంతానికి మరింత శోభ వచ్చింది. యువరాజుకు ఇప్పుడు ఆరేళ్ళు నిండాయి. జయానంద ముని అతనికి సందీపుడు అని నామకరణం చేశాడు. అడవిలోని పక్షులనూ, జంతువులనూ తన కనుసన్నలలో నడపగల శక్తి జయానందమునికి వున్నది గనక, వాటి సాయంతో ఆయన తన ముఖ్యమైన పనులను చేయించుకునేవాడు. అయితే, ఈ సంగతి చాలామందికి తెలియదు. ముని తనకున్న ఈ అపూర్వశక్తిని మెల్ల



మెల్లగా సందీపుడికి ప్రసాదించసాగాడు. అందువల్ల సందీపుడు మనుషులతో ఆడుకునే విధంగా, ఎల్లవేళలా అరణ్య మృగాలతో ఆటలాడుకునేవాడు! సందీపుడి మిత్రులలో పెద్దపెద్ద దంతాలతో కరీంద్రమనే పెద్ద ఏనుగు ఒకటి వుండేది. అది అడవిలోని ఏనుగు లన్నిటికీ పెద్దగా వ్యవహరించేది. కరీంద్రం రోజు తప్పకుండా సందీపుడి దగ్గరకు వచ్చేది. సందీపుడికి దానిమీద ఊరేగాలని ఉన్నప్పుడు నవ్వుతూ చేతులు పైకెత్తేవాడు. అది వెంటనే అతన్ని తొండంతో సుతారంగా పైకెత్తి దాని వీపుమీద కూర్చోబెట్టుకునేది. సందీపుడు కింద పడిపోకుండా పట్టుకోవడానికి ఒక కోతి అతని వెనక కూర్చునేది. మల్లి అనే చిలుక, చెట్టుచెట్టుకూ ఎగురుతూ ఏనుగు నడిచే మార్గాన్ని సూచిస్తూ ఉండేది.

యువరాజు అరణ్యానికి వచ్చినప్పటి నుంచీ, ముని ఆజ్ఞానుసారం, అతని రక్షణ బాధ్యతలు వహిస్తూన్న భల్లూకి అనే ఎలుగుబంటి, భూమికి అడుగున వున్న తియ్యటి కందమూలాలను తవ్వి, తెచ్చి అతనికి అందించేది. అరణ్యానికి దాపులనున్న పొలాలనుంచి చెరకు గడలను తెచ్చి ఇచ్చేది. ఇక, రెండు కోతులూ ఒకదానితో ఒకటి పోటీపడి, యువరాజుకు తియ్యటి మామిడిపళ్ళనూ, జామపళ్ళనూ, అరటిపళ్ళనూ తెచ్చి ఇచ్చేవి.

సందీపుడు తరచూ పులిపిల్లలతో దాగుడుమూతలాడుకునేవాడు. పచ్చగడ్డి మీద వాటితో కుస్తీ పట్టేవాడు.

సందీపుడు రోజూ తెల్లవారగానే సెలయేటిలో స్నానం చేసి, భక్తితో గురు సమక్షానికి వచ్చి కూర్చునేవాడు. గురువు అతనికి ప్రార్థనాశ్లోకాలనూ, ధ్యానపద్ధతులనూ నేర్పేవాడు. ఆ తరవాత కొంతసేపు చదవడమూ, రాయడమూ నేర్పేవాడు. ఆ పిమ్మట సందీపుడు గురువు వెంట అరణ్యంలో కొంతదూరం నడిచేవాడు. అప్పుడు జయానందముని, యువరాజుకు



నుంచే పుట్టాయి. రెండూ కూడా ప్రకృతిలో లభించే నీటినీ, గాలినీ సూర్యరశ్మినీ కావలసిన మేరకు ఉపయోగించుకుంటున్నాయి. అయినా, చంపక పుష్పాలకు ఒక విధమైన రంగూ, వాసనా ఉన్నాయి. మల్లెపువ్వు మరొక విధమైన వాసనలు వెదజల్లుతున్నది. పరిశీలించి చూస్తే ఇందులోని అద్భుతం అర్థమవుతుంది. ఇదే భూమి మీద పుట్టిన ఒక వృక్షం మామిడిపళ్ళనూ, మరొక వృక్షం పనసపళ్ళనూ మనకు అందిస్తున్నవి. ఇంతకన్నా అద్భుతం మరొకటున్నదా?'' అని వివరించేవాడు.

అక్కడి రకరకాల వృక్షాలనూ, చెట్లనూ, మొక్కలనూ, తీగలనూ చూపుతూ, వాటి పేర్లనూ, లక్షణాలనూ, గుణాలనూ వివరించి, ''నాయనా, మనం ఈ అందమైన ప్రకృతిని గౌరవించాలి. మనిషి పుట్టడానికి పూర్వమే ఈ ప్రకృతి ఉన్నది. భగవంతుడి అద్భుతాలను చూడడానికి మనమెక్కడికో వెళ్ళనవసరం లేదు. ప్రకృతిని ఒకసారి పరిశీలనగా చూస్తే చాలు. చూడగలిగిన కళ్ళకు అడుగడుగునా అద్భుతం కనిపిస్తుంది. ప్రతి మొక్కా, ప్రతి క్షణం ఒక అద్భుతాన్ని సృష్టిస్తున్నది. ఇలా చూడు, ఇది చంపక వృక్షం; ఇది మల్లె తీగ. రెండూ భూమి

సందీపుడు గురువు మాటలను ఏకాగ్ర చిత్తంతో ఆలకించేవాడు. ఆ తరవాత ప్రకృతిని పరిశీలనగా చూడడంలో అతడు అపూర్వమైన ఆనందం పొందేవాడు.

''మరొక విషయం గమనించావా? ఈ వృక్షాలు మనకు పళ్ళను ఇస్తున్నాయి గదా, దానికి ప్రతిఫలంగా అవి మననుంచి దేన్నీ ఆశించడంలేదు. నువ్వు జామపండునో, మామిడిపండునో కోసుకున్నావనుకో, చెట్లు దానికి ప్రతిఫలంగా నీనుంచి ఏదీ అడగడం లేదుగదా! ఎదుటివారికి ఇవ్వడంలోనూ, వారిని ఆనందపరచడంలోనూ, వాటి ఆనందమంతా ఇమిడి ఉన్నది. పరోపకారం చేయడంలో ఉన్న

ఆనందాన్ని మనుషులు కూడా పొంద గలగాలి. ప్రకృతిలోని ఈ మహోన్నత గుణాన్ని మానవజాతి అలవరచుకోవాలి!'' అని అనేవాడు జయానందముని.

సాయంకాల సమయాలలో ముని, సందీపుణ్ణి కొండమీదికి తీసుకుపోయి, ఆకాశంలో అప్పుడప్పుడే మెరుస్తూన్న చుక్కలను చూపి, వాటిపేర్లూ, వాటికి సంబంధించిన పురాణగాథలూ వివరించే వాడు.

ఈ విధంగా, రాజధానీ నగరానికి దూరంగా అరణ్యంమధ్య ప్రశాంత వాతావరణంలో, జయానందముని చల్లని నీడలో పెరగసాగాడు యువరాజు!

గురువు వివరించిన కథలలోని రాముడూ, కృష్ణుడూ, ధ్రువుడూ, నచికేతుడూ మొదలైనవారికందరికీ తల్లిదండ్రు లున్నారు కదా! మరి తనకెందుకు లేరన్న అనుమానం కలిగింది సందీపుడికి.అతడు ఒకనాడు మునితో, ''నా తల్లీ, తండ్రీ ఎవరు?'' అని అడిగాడు.

''ఒక బిడ్డకు, తల్లీ తండ్రీ అవసరం ఎందుకో తెలుసా? దేవుడు తన ప్రేమను, తల్లిదండ్రుల ద్వారా ఆ బిడ్డకు అంద జేయడానికే! మరి, నువ్వు అందరిలాంటి వాడివి కావు; చాలా గొప్పవాడివి! అందుకే మధ్యవర్తిలేకుండానే దేవుడి ప్రేమ



తిన్నగా నీకు లభ్యమవుతున్నది!'' అన్నాడు ముని ఎంతో ఆప్యాయంగా.

సందీపుడు తల ఊపి చిన్నగా నవ్వుతూ, ''ఆ దేవుడి ప్రేమ, నాకు కూడా తల్లిదండ్రుల ద్వారానే లభిస్తున్నది. మీరే నా తండ్రి; ఈ ప్రకృతే నా తల్లి!'' అని అన్నాడు.

అందుకు ముని నవ్వి, ''నువ్వెంతో వివేక సంపన్నుడివి. చుట్టూ వున్న ప్రతి వస్తువులోనూ దేవుడి ప్రేమను సందర్శించ గల శక్తి కలగాలని నిన్ను ఆశీర్వదిస్తున్నాను!'' అన్నాడు సందీపుడి తల నిమురుతూ.

* * *



సింహాసనంపై కూర్చుని వున్న వీరసింహుడు, చారులు తెచ్చిన వార్త విని అగ్గిమీది గుగ్గిలంలా ఎగిరి పడ్డాడు. ''కపాలకంతా ఏమిటిదంతా? ఇవాళ కూడా అదే దుర్వార్త! ఈరోజు మళ్ళీ మన వారినుంచి ధాన్యం దోచుకున్నారట. మన మనుషుల్ని దోచుకునే ఆ దుర్మార్గులెవ్వరు ?'' అని అరిచాడు.

కపాలకంతుడు వెంటనే ఏమి చెప్పడానికీ తెలియక, మౌనంగా తల వంచుకున్నాడు.

''ఆ దోపిడీ ముఠాను ఎలాగైనా బంధించి, వాళ్ళందరినీ సమూలంగా నాశనం చేయాలి. ఆ దుర్మార్గులకు సాయపడేవాళ్ళను, వాళ్ళెవరయినా సరే కఠినంగా శిక్షించాలి.'' అన్నాడు వీరసింహుడు పళ్ళు కొరుకుతూ.

మరుక్షణమే ఎక్కడినుంచో ఒక బాణం సభామంటపం కిటికీగుండా దూసుకుని వచ్చి ఎదురుగా వున్న గోడకు ఖంగుమని తగిలి కిందపడింది. బాణం కొసకు చిన్న గుడ్డ కట్టబడి వున్నది.

వీరసింహుడు ఆశ్చర్యంగా సింహాసనం నుంచి లేచాడు. అతని వెంట సభికులందరూ లేచి నిలబడ్డారు.

ఆ బాణాన్ని అందుకోవడానికి కపాలకంతుడు నాలుగడుగులు వేశాడు.

''మూర్ఖుడా, ఆగు!'' అని అరిచాడు వీరసింహుడు.

కపాలకంతుడు అక్కడే నిలబడిపోయాడు.

''మొదట వెళ్ళి ఆ బాణం వేసిన వాడెవడో వాణ్ణి పట్టుకో. రాజభవనం సమీపించి ఆ బాణం వేసిన దుర్మార్గుణ్ణి మన భటులు బంధించారేమో చూడు. లేకుంటే వాణ్ణి తరిమిపట్టుకో. వెళ్ళు.... ఊఁ'' అని అజ్ఞాపించాడు వీరసింహుడు.

కపాలకంతుడు గబగబా సభ నుంచి వెలుపలికి పరిగెత్తాడు. అతని వెంబడే మరి కొందరు అధికారులు కూడా వెళ్ళారు.

''ఇప్పుడు ఆ బాణం తీసుకురండి. అందులో ఏమున్నదో చూద్దాం,'' అన్నాడు వీరసింహుడు.

వీరసింహుడి ప్రధాన అంగరక్షకుడు వెళ్ళి బాణాన్ని తెచ్చి, దాని కొసకు కట్టి వున్న గుడ్డను విప్పి అందులో వున్న తాళపత్రాన్ని వీరసింహుడికి అందించాడు. ఆ పత్రంలో ఇలా రాసి ఉన్నది: "మేము మీ మనుషులను దోచుకోవడం లేదు. నిజానికి మీరే అమాయక ప్రజలను అన్యాయంగా దోచుకుంటున్నారు. అసలు దోపిడీ దొంగలు మీరే! రైతులు కాయకష్టం చేసి పండించిన ధాన్యాన్ని వారి నుంచి మీరు బలవంతంగా దోచుకుపోతున్నారు. ఆ ధాన్యంతో ఆయుధాలు కొనడానికి మీరు ప్రయత్నిస్తున్నారు. మన ప్రజలకు కావలసింది కూడూ, గుడ్డా తప్ప ఆయుధాలు కావు. అందువల్ల, అమాయక ప్రజలనుంచి మీరు దోచుకున్న ధాన్యాన్ని మళ్ళీ రాబట్టుకోవడానికి ప్రజలే శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు!''

ఆ లేఖను చదివిన వీరసింహుడి కళ్ళు కోపావేశంతో ఎర్రబడ్డాయి. అంతటా ఒక నిమిషం నిశ్శబ్దం ఆవరించింది.

బాణం వేసిన వాణ్ణి, కపాలకంతుడు కాళ్ళు చేతులు బంధించి లాక్కొని రాగలడన్న ఆశతో వీరసింహుడు కొంతసేపు ప్రధాన ద్వారం కేసి చూశాడు. అయినా వాడి జాడ కనిపించలేదు. వీరసింహుడు ఓర్పును కోల్పోయి ఆగ్రహావేశంతో ఊగి



పోతూ, "నేను మన మనుషుల్ని ఎవరో దోచుకుంటున్నారని ఇంతకుముందు అన్న మాటలు విన్న తరవాతే, ఎవడో ఈ లేఖను రాశాడు. అంటే మనమధ్యే శత్రువుల గూఢచారి ఎవడో వుండి, నా మాటలను శత్రువులకు చేరవేసి వుండాలి. లేదా, వాడే ఈ లేఖను రాసి వుండాలి. ఇది ఏమాత్రం సహించరానిది. అపాయం కూడా. ఈ క్షణమే ఆ దుర్మార్గుణ్ణి హతమార్చండి! హతమార్చండి! వద్దు, వద్దు....ఆగండి....వాణ్ణి చంపకండి. ఆ దుర్మార్గుడి నుంచి తిరుగుబాటుదారుల ముఠా రహస్యాలను కక్కించాలి!" అని పిచ్చివాడిలా అరవసాగాడు.

కపాలకంఠుడూ, అతడి అనుచరులూ తిరిగివచ్చి, సభామంటపంలో అడుగు పెట్టగానే, "ఎక్కడ ఆ దుర్మార్గుడు? వాణ్ణి హతమార్చేశారా?" అని అడిగాడు వీరసింహుడు.

"లేదు మహాప్రభూ! ఆ దుర్మార్గుడు తప్పించుకుని పారిపోయాడు. రాజభవనం కిటికీ గుండా వాడు బాణం ఎక్కుపెట్టేప్పుడు మన భటుడొకడు చూసి పట్టుకోవడానికి ప్రయత్నించాడట. కాని అలోగానే ఆ పిరికిపంద గుర్రంపై పారిపోయాడట!" అన్నాడు కపాలకంఠుడు.

"గుర్రంపై పారిపోయాడా? వాణ్ణి వెంబడించి పట్టుకోవడానికి మన వద్ద గుర్రాలే లేవా?" అని ప్రశ్నించాడు వీరసింహుడు కోపంగా.

"భటుడు అశ్వశాలకు వెళ్ళి, గుర్రమెక్కి వెళ్ళేలోగా ఆ దుర్మార్గుడు పారిపోయాడు ప్రభూ!" అన్నాడు కపాలకంఠుడు.

"ఆ చేతకాని భటుణ్ణి వెంటనే ఉరి తీయించు! ఆగు ఆగు, ఆ గుర్రాన్ని కూడా చంపించు!" అని అరిచాడు వీరసింహుడు.

పట్టరాని ఆగ్రహంతో మతి చలించినవాడిలా మాట్లాడే వీరసింహుడి మాటలు విన్న సభలోని వారందరూ అమితాశ్చర్యంతో ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. —(ఇంకావుంది)






# రాజు పరీక్ష

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రి వేళ, ఈ శ్మశానంలో ఇన్ని శ్రమలకోర్చుతున్నావంటే, ఏదో ఒక ముఖ్యమైన కార్యం సాధించ దలచావని అర్థమౌతున్నది. కాని, రాజులు చపల చిత్తులని విజ్ఞులనేదాంట్లో సందేహించ వలసిందేమీ లేదు. అందువల్ల, నువ్వు పూనిన కార్యం సఫలమయ్యాక తృప్తి చెందుతావన్న నమ్మకం నాకు లేదు. ఇందుకు ఉదాహరణగా చంద్రదేవుడనే రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం చంద్రదేవుడనే రాజు, దక్షిణా పురి అనే రాజ్యాన్ని పాలిస్తూండేవాడు.

## బేతాళ కథలు



అయనకు లక్ష్మి అనే కుమార్తె తప్ప పుత్రసంతానం లేదు. సుభద్రుడు, వీర బాహు అనే దూరపు బంధువులైన ఇద్దరు యువకులు రాజప్రాసాదంలో వుంటూండే వాళ్ళు. ఇద్దరూ స్ఫురద్రూపులూ, మంచి తెలివితేటలు గలవాళ్ళే కాక, రాజుపట్ల ఎంతో వినయ విధేయతలతో మెలుగు తూండే వాళ్ళు.

ఒకనాడు రాణి, రాజుతో, "లక్ష్మిని, సుభద్ర వీరబాహుల్లో ఎవరికో ఒకరికిచ్చి, వివాహం చేయడం మంచిది. ఇంకా కాలయాపన తగదు," అన్నది.

"ఆ ఇద్దరిలో నీకు నచ్చిన వాళ్ళె వరు?" అని అడిగాడు రాజు.

"ఇద్దరూ మంచివాళ్ళే. అయితే నాకు వీరబాహు అంటే ఎక్కువ అభిమానం. అతడు సుభద్రుడికన్న అందగాడు," అన్నది రాణి.

అందుకు రాజు చిరునవ్వు నవ్వి, "అలాగా, మరి నాకు సుభద్రుడంటే అభిమానం! ఏమైనా మనం ఆ ఇద్దరి అందచందాలను మాత్రమే చూసి, అమ్మాయికి ఎవరు తగిన వరుడో నిర్ణయిం చడం పొరబాటు. ఒక మనిషి నీచ ప్రవృత్తిగలవాడైతే, ఎంత గొప్ప రూపం కూడా దాన్ని దాచలేదు. నీతివంతుడు అనాకారి అయినా అందరూ గౌరవిస్తారు," అన్నాడు.

"ఏమో, నాకు మాత్రం వీరబాహు రూపవంతుడే కాక, గుణవంతుడని కూడా నమ్మకం," అన్నది రాణి.

"సరే, ఆ ఇద్దరికీ ఏదైనా పరీక్ష పెట్టి చూద్దాం. సుభద్రుడు వివేకి, ఎక్కువతెలివి తేటలు గలవాడిలా కనిపిస్తాడు," అన్నాడు రాజు.

ఆ మర్నాడు రాజు, సుభద్రుణ్ణీ, వీర బాహునూ పిలిపించి, "మన రాజ్యపు సరిహద్దుల్లోని ధాన్యకూటం అనే పరగణా ముఖ్యగ్రామం గురించి, మీరు వినే వుంటారు. ఆ ప్రాంతపు ప్రజలనుంచి పన్నులు ఇంతవరకూ ఖజానాకు చేరలేదు.

రాజోద్యోగులు ఏమరుపాటుగా వున్నారని, నా అనుమానం," అని వీరబాహుతో; "నీకు ధాన్యకూటానికి ఉత్తరాన వున్న ఊళ్ళలో పన్నులు వసూలుచేసే బాధ్యత ఇస్తున్నాను. అలాగే సుభద్రుడు ధాన్యకూటానికి దక్షిణాన వున్న గ్రామాల్లో పన్నులు వసూలుచేసే బాధ్యత వహించాలి," అన్నాడు.

ఇందుకు సుభద్రుడూ, వీరబాహూ సరేనని బయలుదేరబోతున్నంతలో, రాజు వాళ్ళను ఆగమని, "మీరు ధాన్యకూటంలోని మన భవనంలో విడిది చేయవచ్చు. తిరిగి వచ్చేటప్పుడు విడివిడిగా కాక, ఇద్దరూ కలిసి రండి. మరొక సంగతి: మీ ఇద్దరి వెంటా అంగరక్షకుల్ని పంపడం లేదు. కారణం ఏమిటో తెలుసా? మీరు స్వరక్షణతోపాటు, ఖజానాకు చేరవలసిన ధనాన్ని కూడా స్వశక్తితో కాపాడుకోగలరో లేదో పరీక్షించదలిచాను. ముందుముందు మీలో ఒకరిని సేనాధిపతిగా నియమించాలని, నా ఆలోచన," అన్నాడు.

సుభద్రుడూ, వీరబాహూ ఆ మాటలు విని చాలా సంతోషపడి, ధాన్యకూటం కేసి బయలు దేరారు. వాళ్ళు అటు వెళ్ళగానే రాజు, తన మంత్రి కొడుకైన కృష్ణకుమారుడు అనే వాణ్ణి పిలిచి, మారువేషంతో వాళ్ళిద్దరినీ అనుసరించి వెళ్ళి,



వాళ్ళేమిచేసేదీ ఒక కంట కనిపెట్టి వుండమని ఆజ్ఞాపించాడు.

ధాన్యకూటంలోని రాజోద్యోగులు సుభద్రుడూ, వీరబాహూ వచ్చిన పని తెలుసుకుని, వాళ్ళంతకుముందు రైతుల నుంచీ, వర్తకులనుంచీ వసూలు చేసిన పన్నులను, వాళ్ళకు చెల్లించారు. అందువల్ల వాళ్ళిద్దరికీ పన్నుల వసూళ్ళకు గ్రామాల వెంట తిరగవలసిన శ్రమ తప్పింది. ఈ విధంగా రెండు వారాల్లో సుభద్రుడూ, వీరబాహూ తాము వచ్చిన పని పూర్తి చేయగలిగారు.

రేపు ఉదయం వాళ్ళు తిరిగి రాజధానికి బయలుదేరవలసి వున్నదనగా, ఆ రాత్రి



ఎవరో వీరబాహు వున్న గది తలుపు తట్టారు. అతడు గదితలుపు తెరవగానే, ఒక ముసుగువ్యక్తి అతడికి కత్తి చూపించి, ధనం వున్న సంచీ తీసుకుని బయటికి వచ్చి, తలుపుకు బయట నుంచి గడి బిగించి, పారిపోయాడు.

ఆ తర్వాత గదిలో వున్న వీరబాహు కేకలు విని, కాపలావాళ్ళు వచ్చి గది తలుపు తెరిచారు. సుభద్రుడు కూడా అక్కడికి వచ్చాడు. వీరబాహు కొంత సేపటికి తెప్పరిల్లి, జరిగినదంతా వాళ్ళకు చెప్పాడు.

ఇది విని భవనం కాపలావాళ్ళ పెద్ద ఆశ్చర్యపోయి, "ఈ ప్రాంతాల దొంగతనం జరగడం, ఇదే మొదలు. రాజుగారి ఉద్యోగినే దోచడం అంటే—వాడెవడో పెద్ద బందిపోటు అయివుండాలి!" అన్నాడు.

మర్నాడు సూర్యోదయంతోనే బయలుదేరి సుభద్రుడూ, వీరబాహూ రాజధానికి తిరిగి వచ్చారు. సుభద్రుడు తాను వసూలు చేసిన ధనాన్ని రాజుకు ఇచ్చాడు. వీరబాహు మాత్రం కళ్ళనీళ్ళతో తల వంచుకుని వుండిపోయాడు.

రాజు, అతడితో ఓదార్పుగా, "ఊరికే విచారపడకు. ఆ పరిస్థితుల్లో నేనైనా ఏమీ చేయగలిగేవాణ్ణి కాదు. రాజభవనంలాంటి దానిలోకి బందిపోటు జొరబడగలడని, ఎవరూహించగలరు!" అన్నాడు.

రాజుగారి అభిమానానికి తాను పాత్రుణ్ణయాననీ, ఏదో గొప్పపదవి తనకు రానున్నదనీ సుభద్రుడు చాలా సంతోషించాడు.

ఆ సాయంత్రం కృష్ణకుమారుడు రాజును దర్శించి, ఆయనముందు ఒక సంచీని పెడుతూ, "మహారాజా, వీరబాహు పోగొట్టుకున్న ధనం సంచీ ఇది!" అని చెప్పాడు.

"అయితే, వీరబాహు నుంచి ధనం దొంగిలించినది, నువ్వా?" అని అడిగాడు రాజు ఆశ్చర్యంగా.



''కాదు, మహారాజా! అలా చేయమని తమరు నాకు అజ్ఞ యివ్వలేదు. కాని, ఆ దొంగ చీకట్లో పారిపోతూండగా, అతడి నుంచి సంచీని నేను లాక్కున్నాను,'' అన్నాడు కృష్ణకుమారుడు.

''మరి ఆ దొంగను పట్టుకునే ప్రయత్నం చేయలేదా?'' అని అడిగాడు రాజు.

''అందుకు ప్రయత్నించలేదు, మహారాజా! కావాలంటే అతణ్ణి గాయపరచడమో, లేక చంపడమో చేసి వుండేవాణ్ణి. అయితే, అతడు ముసుగు ధరించి వున్నా, నేను గుర్తుపట్టాను. సంచీతోపాటు అతడి ముసుగును కూడా లాక్కున్నాను. అప్పుడతను విడిది భవనం కేసి పరిగెత్తాడు,'' అన్నాడు కృష్ణకుమారుడు.

''దొంగభవనంలోకి పారిపోవడమా!'' అంటూ రాజు విస్మయం చెందాడు.

''అవును, మహారాజా! అందుకొక కారణం వున్నది. ఆ దొంగ విడిది చేసిన గది, వీరబాహు వున్న గదికి పక్కనే వున్నది,'' అన్నాడు కృష్ణకుమారుడు.

రాజు క్షణం ఆలోచించి, ''అయినా, నువ్వా దొంగను బంధిస్తే బావుండేది. అతడు చేసింది మామూలు నేరం కాదు, చాలా పెద్ద నేరం,'' అన్నాడు.

''ఒక సంగతి, మహారాజా! అతడు తప్పక ఇక్కడికి తిరిగి వస్తాడు. అప్పుడు కావాలనుకుంటే మీరు శిక్షించవచ్చనుకున్నాను. పైగా, నేను మారువేషంలో వుండడంతో, తనను ఎరిగినవాడు కాదనుకున్నాడు. అంతేకాక, నేనూ ఒక దొంగనని అతడు భావించి వుండవచ్చు,'' అన్నాడు కృష్ణకుమారుడు.

ఆ రాత్రి రాజు, రాణితో, ''ఈ రాజ్యానికి వారసుడెవడో నిర్ణయించాను. అయితే, అందుకు నువ్వు కూడా సమ్మతి తెలియపరచవలసి వుంటుంది,'' అన్నాడు.

''మీ పరీక్షలో వీరబాహు ఓడిపోయాడు. మరి సుభద్రుణ్ణే కదా, మీరు వారసుడుగా నిర్ణయించబోతున్నది, అవునా?'' అని అడిగింది రాణి.

అంగీకారమే. యువరాణికి, మంత్రి కుమారుడిపట్ల చాలా అభిమానం వున్న దని, నేనెరుగుదును,'' అన్నది.

ఆ తర్వాత యువరాణి లక్ష్మికీ, కృష్ణ కుమారుడికీ అత్యంత వైభవంగా వివాహం జరిగింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, కృష్ణకుమారుడు చేసిన పని, ఏ రాజోద్యోగి అయినా చేయగలడు. అతడి ప్రవర్తనలో ప్రత్యేకంగా చెప్పుకోదగిందేమున్నది? అతడు తన బాధ్యత ఏమిటో తెలిసిన వాడూ, ధైర్యశాలీ అనేదాంట్లో సందేహం లేదు. కాని దురాశాపరుడు కాదనేందుకూ, నిజాయితీగలవాడని చెప్పేందుకూ రుజువేమున్నది? రాజు, కృష్ణకుమారుడు ప్రవర్తించిన తీరుచూసి, అంతగా తృప్తి చెందడానికి అతడి చపలచిత్తం తప్ప మరేదైనా ముఖ్యకారణం వున్నదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''వీరబాహు నుంచి ధనం వున్న సంచీని దొంగిలించిన వాడు, సుభద్రుడని తెలుస్తూనే వున్నది. ఈ చర్యద్వారా తాను సమర్థుణ్ణనీ, వీర బాహు అసమర్థుడనీ రుజువు చేద్దామను కున్నాడతను. కాని, ఫలితంగా ఇద్దరూ



''కాదు. నేను ఎన్నిక చేసినవాడు కృష్ణకుమారుడు. అతడు తన బాధ్యత ఏమిటో ఎరిగినవాడే కాక, మహా ధైర్య శాలి. అప్పగించిన పనిని ఎంతవరకు చేయాలో, ఎక్కడ మౌనం వహించాలో అతడికి బాగా తెలుసు. అంతేకాక, ఏమాత్రం దురాశలేనివాడు; మంచి నిజాయితీపరుడు. ఇటువంటి గుణ గణాలున్నవాడు, యువరాజుగా రాణించి తీరుతాడు,'' అన్నాడు రాజు.

రాణీ కొంచెంసేపు మౌనంగా వూరు కుని, తర్వాత చిరునవ్వునవ్వి, ''ఇలా జరిగే అవకాశం వున్నదని, నేనేనాడూ ఊహించలేదు. మీ నిర్ణయం, నాకూ

అసమర్థులూ, అయోగ్యులూ అని తేలి పోయింది. వీరబాహు కత్తి చూసి బెదిరి పోయి ధనాన్ని కాపాడుకోలేకపోవడం, సుభద్రుడు దొంగతనం లాంటి నీచ కృత్యానికి పాల్పడడం ఇందుకు చక్కని నిదర్శనం. అయితే, కృష్ణకుమారుడు మాత్రం, తాను బాధ్యత గుర్తించినవాడే కాక, ధైర్యశాలిననీ, దురాశలేనివాడిననీ రుజువు చేశాడు. అంతేకాక, ధాన్యకూటం గ్రామంలో సుభద్రుడి దొంగతనం గురించి అతడు ఎవరికీ చెప్పలేదు. ఇది అతడి నిజాయితీకి నిదర్శనం. రాజుగారి బంధువే కాక, ఆయన పంపగా శిస్తు వసూళ్ళకు వచ్చినవాడు దొంగ అని నలుగురికీ తెలియడం, రాజాస్థానానికి ఎంతో అవమానకరమైన సంగతి. ఇది గుర్తించే కృష్ణకుమారుడు, ఆ దొంగతనం గురించి రాజుకు మాత్రమే చెప్పాడు. అందుకు కారణం, కావాలనుకుంటే రాజే, సుభద్రుణ్ణి శిక్షించవచ్చు. ఏ పనినీ అవసరానికి మించి చేయకపోవడం అనేది, మనిషిలోని తెలివితేటలకూ, సత్ప్రవర్తనకూ గీటురాయి లాంటిది. కృష్ణకుమారుడు అలాంటి మంచి లక్షణం కలవాడు! ఉదాహరణకు — అతడు సుభద్రుడి నుంచి ధనం సంచీ లాక్కున్నప్పుడు, అతడు మారువేషంలో వున్నాడు. అతడెవరైనదీ, ఏ ఒక్కరికీ తెలిసే అవకాశం లేదు. కావాలంటే, ఆ ధనాన్ని తనే రహస్యంగా దాచుకో వచ్చు. కాని, అతడు రాజుకు దాన్ని యిచ్చి, జరిగినది వివరించి, తన నిజాయితీని స్పష్టంగా రుజువుచేసుకున్నాడు. పై కారణాలన్నింటివల్లా, రాజు అతడి ప్రవర్తనపట్ల పూర్తిగా సంతృప్తుడయ్యాడు. అందువల్ల రాజు చపలచిత్తుడనుకోవడానికి ఏమాత్రం ఆస్కారం లేదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: మనోజ్‌దాస్ రచన]



# ఆత్మజ్ఞానం

పంట పొలానికి కాపుకాస్తున్న రైతూ, దారివెంట వెళుతున్న సన్యాసీ కొద్దిసేపు విశ్రాంతికోసం, ఒక చెట్టు నీడకు చేరారు.

సన్యాసి, రైతును పలకరిస్తూ, "పొలం నీదేనా? పంట బాగున్నది. ఈ ఏడు కూడా తరుణంలో వర్షాలు కురవవచ్చా?" అని అడిగాడు.

రైతు, సన్యాసికి నమస్కరించి, "స్వామీ, చేతికి దక్కిన తర్వాతేగదా, పంట దిగుబడి ఎంతో తెలిసేది. వర్షాలు ఎప్పుడు ఎలా వుంటాయో ఎవరు చెప్పగలరు! ఇంతకూ తమ ప్రయాణం ఎంతదాకా?" అని అడిగాడు.

సన్యాసి దాపులనున్న కొండలకేసి చూపిస్తూ, "అక్కడ గొప్ప జ్ఞాని అయిన సిద్ధుడొకాయనవున్నాడు. జ్ఞానోపదేశం కోసం అక్కడికి వెళ్తున్నాను," అని విచారంగా ముఖం పెట్టి, "ఇంతకుముందు సేవించుకున్న ముగ్గురు గురువులూ, నాకు ఆత్మజ్ఞానం కలిగేలా చేయలేక పోయారు. ఈసారి నా అదృష్టం ఎలా వున్నదో మరి!" అని నిట్టూర్చాడు.

రైతు నవ్వి, "నలభై ఏళ్ళనుంచి ఫలసాయం, యాభై ఏళ్ళనుంచి వర్షాలూ చూస్తున్నాను. రేపు ఏది ఎలా వస్తుందో తెలుసుకోవడానికి, ఇన్నేళ్ళ సొంత అనుభవం ఎందుకూ పనికిరావడం లేదు. మరి ఇతరుల అనుభవాలమీద తమరు ఆత్మజ్ఞానం పొందడం ఎంతకష్టమో గదా, పాపం!" అన్నాడు కొండలకేసి చూస్తూ.

సన్యాసికి ఈ మాటలతో చప్పున జ్ఞానోదయమై, తనను తాను సొంతంగా తెలుసుకోవాలని బోధపడి, మరొక దిక్కుగా ప్రయాణమై వెళ్ళిపోయాడు. —డాక్టర్ కె. వి. రమణరావు



# చందమామ అనుబంధం—20

## మన విజ్ఞాన సంపద

### ఎవరాయన?

భారత ప్రథమ స్వాతంత్ర్య సమరం—సిపాయిల కలహం నాటి రోజులవి. ఒక చిన్నరాజ్యానికి రాజు—అంగ్లేయులకు ఎదురుతిరిగే తిరుబాటుదార్ల నాయకులలో ఒకడయ్యాడు. ఆయన శత్రువులతో ఒకవైపున పోరాడుతున్నప్పుడు, ఈస్టిండియా కంపెనీ సేనలు ఆయన రాజ్యాన్ని మరొక వైపు నుంచి ముట్టడించాయి. విషయం తెలియగానే ఆయన అక్కడికి వెళ్ళడానికి ప్రయత్నించాడు. కాని, ఆయనకు దారి ఇవ్వకుండా బ్రిటిష్ సేనలు పట్టుదలతో పోరాడాయి. అయినా, ఆయన ధైర్యంగా శత్రుసేనల మధ్య పోరాడుతూ ముందుకు వెళ్ళాడు. తెల్లవారి తుపాకీ తూటాలు ఆయన కుడిచేతిలోకి చొచ్చుకుపోయాయి. వాటి కారణంగా, కుడిచేతిని తొలగిస్తే తప్ప ప్రాణాపాయం తప్పని స్థితి ఆయనకు ఏర్పడింది!

శస్త్రచికిత్సకు వైద్యులను పిలిపించే సావకాశం లేదు. వెంటనే ఆయన గంగాతీరంలో నిలబడి, ఎడమచేత్తో కత్తిని పైకెత్తి, ''తల్లీ, దీనిని కానుకగా స్వీకరించు!'' అంటూ తన కుడిచేతిని తెగనరుక్కున్నాడు!

ఆయన యువకుడయితే ఒకవేళ బతికి వుండేవాడేమో కాని, అప్పుడా మహావీరుడి వయసు డెబ్భైఅయిదు సంవత్సరాలు! ఇది జరిగిన మరునాడే ఆయన మరణించాడు. ఎవరాయన? (36వ పేజీ చూడండి)

### మీకు తెలుసా?

1. 'బహాయ్' మతం అంటే ఏమిటి?
2. 'బహాయ్' ఆలయం మన దేశంలో ఎక్కడ వున్నది?
3. "ఎగిరే పళ్ళాల"ను మొట్టమొదట చూసిన వ్యక్తి ఎవరు?
4. వాటిని ఆయన ఎప్పుడు చూశారు?
5. వాటిని 'ఎగిరే పళ్ళాలు' అని ఎందుకు అంటారు?

(36వ పేజీ చూడండి)

# కామరూపరాజ్యం

మన పురాణాలు పేర్కొనే సుప్రసిద్ధ రాజ్యాలలో ప్రాగ్జ్యోతిషపురం రాజధానిగా వెలసిన కామరూపరాజ్యం చాలా ముఖ్యమైనది. 'కామరూపరాజ్యా'నికి, కోరినది లభించే భూమి అని కొందరు అర్థం చెబుతారు. పురాణాల ప్రకారం శివుడి కోపాగ్నికి మన్మథుడు (కాముడు) భస్మమై పోయాడు. ఆ తరవాత మన్మథుడి భార్య రతీదేవి ప్రార్థించగా, శివుడు కరుణించి, మన్మథుడికి రూపం ప్రసాదించాడు. కాముడు మళ్ళీ తన రూపం పొందిన స్థలం కాబట్టి దీనికి 'కామరూప'మనే పేరు వచ్చిందని మరి కొందరు అభిప్రాయపడుతున్నారు.

ప్రాగ్జ్యోతిషపురం అంటే—తూర్పు దిశకు వెలుగువంటి నగరం అని అర్థం!

ఈనాటి మన అస్సాం రాష్ట్రమే మన పురాణాలు పేర్కొనే ఒకనాటి కామరూపదేశం. గౌహతి, పురాతన నామమే ప్రాగ్జ్యోతిషపురం. గౌహతికి సమీపంలోని ఒక కొండ మీద కామరూప రాజ్య అధిదేవత 'కామాక్షి' మందిరం వెలుగొందుతున్నది.

పురాణాల ప్రకారం నరకాసురుడు మిథిల నుంచి వచ్చి కామరూప






## రాక్షసబల్లుల కోసం తవ్వకాలు

ఒకప్పుడు ఈ భూమి మీద సంచరించిన రాక్షస బల్లుల (డినొజార్స్) రహస్యాలను వెలికి తీవడానికి, విజ్ఞానవేత్తలు గత శతాబ్ది కాలంగా, డెన్వర్ పర్వత ప్రాంతంలో తవ్వకాలు సాగిస్తున్నారు. ఈ పర్వతాలు ఏర్పడడానికి పూర్వం అంటే—14 కోట్ల సంవత్సరాలకు పూర్వం జీవించిన రాక్షస బల్లుల శిలాజాలు ఇక్కడ లభిస్తున్నాయి. ఇక్కడ లభించిన కొన్ని వస్తువుల ద్వారా రాక్షస బల్లులకు సంబంధించిన మరి కొన్ని రహస్యాలు వెలుగులోకి రావచ్చు!



ప్రాంతాన్ని చేరాడు. అతని కుమారుడు భగదత్తుడు మహాభారత యుద్ధంలో కౌరవులపక్షం వహించి హతుడయ్యాడు.

ఇక చారిత్రక యుగానికి వచ్చామంటే—క్రీ. శ. నాలగవ శతాబ్దంలో సముద్రగుప్తుడి సామంతరాజయిన, పుష్యవర్మ ఈ ప్రాంతాన్ని పరిపాలించాడు.

13వ శతాబ్దంలో ఎగువ బర్మా నుంచి, 'షాన్' తెగకు చెందిన అహోములు ఇక్కడి ఎక్కువ భూభాగాన్ని ఆక్రమించారు. అప్పటి నుంచి దీనికి 'అస్సాం' అనే పేరు వచ్చిందని అంటారు. అసమానమైన స్థలాలు కలిగిన భూమికావడంవల్ల దీనికి అస్సాం అని పేరు వచ్చిందనీ చెబుతారు.

1824వ సంవత్సరంలో ఈ ప్రాంతం బ్రిటిష్‌వారి అధీనంలోకి వచ్చింది.

అహోమ్‌రాజులు 'షాన్' తెగపేర్లు వదిలిపెట్టి, క్రమక్రమంగా హైందవ నామాలను స్వీకరించారు. వాళ్ళు ధైర్య సాహసాలుగల పాలకులుగా పేరు గాంచారు. ముస్లింల, పఠానుల, మొగలుల దురాక్రమణకు లోను కాకుండా తమ ప్రాంతాలను రక్షించారు.

ఈనాటి అస్సాం 78,523 చదరపు కి.మీ. వైశాల్యం కలిగి వున్నది. గౌహతి సమీపంలోని దిస్‌పూర్ దీని నూతన రాజధాని.

## తగ్గుతున్న దురలవాటు!

అమెరికాలో సిగరెట్లు కాల్చే దురలవాటు గత సంవత్సరం దాదాపు ఐదు శాతం తగ్గింది. ఒక పరిశోధనా సంస్థ వెలువరించిన నివేదిక ప్రకారం 1989వ సం॥ అమెరికాలో 53,800 కోట్ల సిగరెట్లు కాల్చారని తెలుస్తున్నది. ఒక వ్యక్తి సరాసరి ఒక సంవత్సరం కాల్చే సిగరెట్లలో ఏడు శాతం తగ్గింది!



# సాహిత్యావలోకనం

1. చెప్పుకోతగిన మొట్టమొదటి ఆంగ్ల నవలారచయిత ఎవరు ?

2. ఆయన రాసిన గొప్ప నవల పేరేమిటి ?

3. అది కేవలం కల్పితకథా ? లేక యథార్థ సంఘటనలు ఆధారంగా గలదా ?

4. అందులోని ప్రధాన పాత్రకు నమూనా ఎవరు ?

5. ఫ్రెంచి, ఆంగ్ల భాషలలో రచనలు చేసి, 21వ యేట కాలధర్మం చెందిన భారతీయ నవలా రచయిత ఎవరు ?

## సమాధానాలు

ఎవరాయన ?

బీహారులోని జగదీశ్‌పూర్‌ను పరిపాలించిన రాజా కుమార్ (కున్వర్) సింగ్.

లోకజ్ఞానం

1. ఇరాన్‌కు చెందిన బహావుల్లా (1817–92) స్థాపించిన సర్వమత సమైక్యతనూ, శాంతి ప్రేమలనూ ప్రబోధించే మతం.
2. కొత్తఢిల్లీలో.
3. కెన్నెత్ ఆర్నాల్డ్ అనే అమెరికా వైమానికుడు.
4. 1947 జూన్‌లో.
5. నీళ్ళ ఉపరితలంలో విసిరిన పళ్ళాలు ఎగిరినట్టు అవి ఎగురుతూ కనిపించాయని ఆర్నాల్డ్ చెప్పడంవల్ల.

సాహిత్యం

1. డేనియల్ డిఫో (1661–1731).
2. రాబిన్‌సన్ క్రూసో.
3. యథార్థ సంఘటనల ఆధారంగా.
4. అలెగ్జాండర్ సెల్‌కిర్క్ అనే నావికుడు.
5. తోరూదత్.




# శ్రీ రామకృష్ణ పరమహంస

మన దేశంలో ఇటీవలి కాలంలో జన్మించిన మహాపురుషులలో శ్రీ రామకృష్ణ పరమహంస మున్నెన్న దగినవారు. ఆ మహనీయుడి గొప్పదనం గురించి, ఆయన జీవితకాలంలో పలువురికి తెలియదు. కాని తదనంతరం, ఆయన ముఖ్య శిష్యుడైన స్వామి వివేకానందుడూ మరికొందరూ కలిసి, తమ గురువుగారి సందేశాలను నలుదిశలకూ వ్యాపింపజేశారు.

బెంగాల్‌లోని కమర్పుకూర్ గ్రామానికి చెందిన క్షుదిరామ్ అనే బ్రాహ్మణుడు ఒకసారి గయ పుణ్యక్షేత్రాన్ని దర్శించాడు. అప్పుడాయనకు ఒక కల వచ్చింది. ఆ కలలో మహావిష్ణువు కనిపించి, "నాకు నీ కడుపున పుట్టాలని ఉన్నది," అని అన్నాడట!






ఆయన భార్య చంద్రాదేవి 1836వ సం॥ ఫిబ్రవరి 17వ తేదీన మూడవ సంతానంగా ఒక కొడుకును కన్నది. తండ్రి ఆ బిడ్డకు గదాధరుడని నామకరణం చేశాడు. శిశువు జాతకాన్ని పరిశీలించిన జ్యోతిష్కులు—ఒక దివ్యాత్మ భువికి దిగివచ్చినట్లు చెప్పారు!



గదాధరుడు పెరిగే కొద్దీ తన ఆట పాటలతో, తెలివితేటలతో అందరి దృష్టినీ ఆకర్షించసాగాడు. స్త్రీలు అతన్ని ఎంతో ఆప్యాయంగా చేరదీసేవారు. ఈత పట్ల అతడెంతో అనక్తి కనబరచేవాడు.

ఏడేళ్ళ ప్రాయంలో గదాధరుడు ఒకనాడు పొలాలగుండా వెళుతూ, ఆకాశంలో నల్లటి మేఘాలనానుకుని ఎగిరే తెల్లటి పక్షుల గుంపును చూసి అమితానందం చెందాడు. ఆ దృశ్యం అతనిలో వింత అనుభూతిని కలిగించింది. అతడు జీవితంలో ప్రప్రథమంగా సమాధిస్థితిని అనుభవించాడు.





అతడక్కడే స్పృహతప్పి పడిపోయాడు. స్నేహితులు అతన్ని ఇంటికి చేర్చారు. అప్పుడతడు మామూలు స్థితికి వచ్చి, మందహాసంతో చుట్టుపక్కల కలయ జూశాడు. అయినా, అప్పటినుంచి అతడు అప్పుడప్పుడూ ఇటువంటి సమాధిస్థితికి లోను కాసాగాడు.

కమర్పుకూర్ చాలా సంపన్న గ్రామం. ఆ గ్రామంగుండా వెళ్ళే యాత్రీకులకు, ఆ గ్రామ భూస్వామి ఒక సత్రం కట్టించాడు. అక్కడికి తరచూ సాధువులు వస్తూ పోతూ వుండేవారు. గదాధరుడు అక్కడికి వెళ్ళి, కూర్చుని సాధువుల సంభాషణలనూ, వాళ్ళు చెప్పుకునే కథలనూ గంటల తరబడి అలకిస్తూ వుండేవాడు.





ఒకనాడు కొందరు సాధువులు, గదాధరుడికి సన్యాసి వేషం వేసి ఒళ్ళంతా విభూతి పూసి ఇంటికి పంపారు. దండ కమండలాలతో ఇంటికి వచ్చిన బిడ్డను చూసి తల్లి అమితాశ్చర్యం చెందింది.

ఎనిమిదేళ్ళ ప్రాయంలోనే గదాధరుడు అద్భుతమైన తెలివితేటలను ప్రదర్శించసాగాడు. ఒకనాడు భూస్వామి ఇంట చేరిన గొప్పగొప్ప పండితులు ఒక సమస్యను పరిష్కరించలేక సతమతమవుతున్నప్పుడు, అక్కడే వున్న గదాధరుడు చక్కని పరిష్కారం సూచించి, అందరికీ ఆశ్చర్యం కలిగించాడు.





గ్రామంలో ఉత్సవం జరిగిన సందర్భంగా మిత్రులందరూ, గదాధరుణ్ణి శివుడి వేషం వేయమని కోరారు. అతడు వారి కోరిక మేరకు శివుడి వేషం ధరించి వేదికమీదికి వచ్చాడు. కాని అతడు వెంటనే సమాధిస్థితికి లోను కావడం వల్ల, నాటకం అర్ధంతరంగా ఆగిపోయింది.

తండ్రి మరణానంతరం, అన్న రామ్‌కుమార్ గదాధరుణ్ణి కలకత్తాకు తీసుకు వచ్చాడు. నగరంలోని పెద్దపెద్ద భవనాలనూ, వచ్చేపోయే వాహనాలనూ, హడావుడిగా తిరిగే మనుషులనూ చూసి, కుర్రవాడైన గదాధరుడు అమితాశ్చర్యం చెందాడు.





రామ్‌కుమార్ చిన్న సంస్కృత పాఠశాలను ప్రారంభించాడు. గదాధరుడు ఆ బడిలో చదవడం ప్రారంభించాడు. కాని, కొంతకాలానికే అతడు అన్నతో, "నాకు ఈ పాఠాలు ఆసక్తికరంగా లేవు. నాకు నిజమైనజ్ఞానం, అంటే, సత్యం గురించిన జ్ఞానం కావాలి!" అని అన్నాడు. —(ఇంకా వుంది)



# నేరవిచారణ

గోవర్ధనగిరిరాజ్యాన్ని పాలించే నరేంద్ర భూపతి, ఎంతో మేధావి గానేకాక ప్రజల కష్టసుఖాలు స్వయంగా పరిశీలించి, న్యాయం కలిగించే వ్యక్తిగా కూడా పేరు పొందాడు.

నరేంద్రభూపతికి ఒక నియమం వున్నది. అదేమిటంటే—ప్రతిరోజూ ఉదయం ఒక గంటకాలం, ఎలాంటి సామాన్య పౌరుడైనా నిరాటంకంగా ఆయనను దర్శించి, తనకు ఎదురైన సమస్యల గురించి విన్నవించుకోవచ్చు. రాజు అలాంటివాళ్ళకు అప్పటికప్పుడే పరిష్కార మార్గాలు చెప్పి పంపుతూండేవాడు.

ఒక రోజు ఉదయం లక్ష్మీరమణి అనే స్త్రీ రాజదర్శనానికి వచ్చింది. మంత్రితో ఏదో మాట్లాడుతున్న రాజు ఆమెను వచ్చిన కారణం అడిగాడు.

అందుకు ఆ స్త్రీ, ''మహారాజా, నా భర్త పేరు కనకాంబరుడు. రోజూ ఉదయమే బయలుదేరి పడవ మీద నది దాటి, పట్నంలో తన వ్యాపారపు పనులు చూసుకుంటూంటాడు. కాని, నిన్న ఉదయం పడవ మీద నది దాటుతూ, నీళ్ళలో పడి కొట్టుకుపోయాడు.'' అని చెప్పింది.

''ప్రమాదవశాత్తూ కాలుజారి నదిలో పడిపోయి వుంటాడా?'' అని అడిగాడు రాజు.

''అలాగే జరిగి వుంటుందని, మొదట అనుకున్నాను, మహారాజా! అయితే, మా పక్క ఇంటి వ్యాపారి ఒకాయన మరొక పడవలో ప్రయాణం చేస్తూ దూరం నుంచి చూశానంటున్నాడు. నా భర్తను పడవ నడిపే జోగులు అనేవాడు, నీటిలోకి తోసేశాడట! నాకు న్యాయం కలిగించండి,'' అంటూ లక్ష్మీరమణి కళ్ళనీళ్ళు పెట్టుకున్నది.

పెంటకోట సోమినాయుడు

రాజు వెంటనే భటులకు, నది దిగువున కనకాంబరుడి శవం కోసం వెదకమని ఆజ్ఞాపించి, లక్ష్మీరమణి చెప్పిన పక్క ఇంటి వ్యాపారి కోసం ఒక నౌకరును పంపాడు.

ఆ వ్యాపారి వచ్చి రాజుకు నమస్కరించి, "మహారాజా, నా పేరు వీరభద్రుడు. కనకాంబరుడి లాగే నేనూ రోజూ ఉదయం పట్నం వెళ్ళేందుకు, పడవ మీద నది దాటుతూంటాను. నిన్న ఉదయం కనకాంబరుడెక్కిన పడవలో కాక, నేను మరొక పడవలో ఎక్కడం జరిగింది. అతనెక్కిన పడవ నాకు కనుచూపు దూరంలో వున్నది. జోగులు, కనకాంబరుడి చేతిలోంచి ఏదో మూట లాక్కొని, అతణ్ణి నదిలోకి తోయడం, నా కళ్ళారా చూశాను," అన్నాడు.

"నీ భర్త దగ్గిరవున్న మూటలో ఎలాంటి వస్తువులున్నవో, నీకు తెలుసా?" అని ప్రశ్నించాడు, రాజు లక్ష్మీరమణిని.

లక్ష్మీరమణి కళ్ళు తుడుచుకుని, "ఆ మూటలో నలభైవరహాలూ, వ్యాపార అవసరం కోసం, పట్నంలో తాకట్టు పెట్టేందుకు తీసుకున్న, నా బంగారు గాజుల జతా వున్నవి, మహారాజా. వాటి కోసం ఆశపడి జోగులు, నా భర్తను నదిలోకి తోసి వుంటాడు. ఆయనకు ఈత రాదు," అన్నది.

ఇంతలో రాజు పంపిన భటులు తిరిగి వచ్చి, కనకాంబరుడి శవం దొరికిందనీ,



దాన్ని నదిగట్టున వుంచి వచ్చామనీ, రాజుకు చెప్పారు.

రాజు, జోగుల్ని తీసుకురమ్మని వాళ్ళకు చెప్పి, మంత్రితో కలిసి కనకాంబరుడి శవాన్ని చూడబోయాడు.

అరగంట తర్వాత ఆయన తిరిగి వచ్చే సరికి, జోగులు రాజమందిరం ముందు చేతులు కట్టుకుని నిలబడి వున్నాడు.

రాజు వాడితో, ''నువ్వు, కనకాంబరుడనే వర్తకుణ్ణి నిన్న ఉదయం, పడవ మీది నుంచి నదిలోకి తోసినట్టు ఫిర్యాదు వచ్చింది,'' అన్నాడు.

వెంటనే జోగులు, ''అదంతా అబద్ధం, మహారాజా! కనకాంబరుడు పడవ అంచున కూర్చుని కునికిపాట్లు పడుతూ, ప్రమాదవశాత్తూ చేతిలోని మూటతోసహా నదిలో పడిపోయాడు,'' అన్నాడు.

''మరి, అప్పుడు నువ్వు అతణ్ణి రక్షించే ప్రయత్నం ఏమైనా చేశావా?'' అని అడిగాడు రాజు.

''చేయకేం, మహారాజా! అతను నీళ్ళలో మునిగిపోతూండగా జుట్టు పట్టుకుని పైకి లాగాలని చూశాను. కాని, నీళ్ళలో బాగా తడిసిపోయిన అతడి జుట్టు, నా చేతిలోంచి జారిపోయింది,'' అన్నాడు జోగులు.

ఆ జవాబుకు రాజు కోపగించుకుని, ''ఒరే, ధనాశకొద్దీ నువ్వే, కనకాంబరుడిని పడవలో నుంచి నదిలోకి నెట్టావు. అందుకు తగిన సాక్ష్యాధారాలున్నవి. నిజం



చెబుతావా, లేక ఇప్పుడే ఉరితీయించ మంటావా?'' అని అడిగాడు.

రాజు ఇలా అనగానే, జోగులు గడగడ వణికి పోతూ, ''అవును, మహారాజా! కనకాంబరుడి దగ్గిరున్న డబ్బు మూట లాక్కుని, నేనే అతణ్ణి నదిలోకి బలవంతంగా తోశాను,'' అన్నాడు.

వెంటనే రాజు, జోగులుకు యావజ్జీవ కారాగార శిక్ష విధించి, లక్ష్మీరమణి కుటుంబానికి తగిన జీవనోపాధి ఏర్పాటు చేయమని, మంత్రికి చెప్పాడు.

మంత్రి ఆయనతో, ''మహారాజా, జోగులు నేరస్థుడని, మీరెలా నిర్ణయించగలిగారో, నాకు అర్థం కావడం లేదు,'' అన్నాడు.

అందుకు రాజు, ''జోగులు, కనకాంబరుడు కునికిపాట్లు పడుతూ, పడవ అంచునుంచి నదిలోకి పడిపోయాడని చెపుతూ, మూటతోసహా అన్నాడు. అప్పుడే నాకు వాడు నేరస్థుడై వుంటాడన్న అనుమానం కలిగింది. కనకాంబరుడి శవాన్ని చూశాక, జోగులు నేరస్థుడన్న నిర్ణయానికి వచ్చాను,'' అన్నాడు.

''అదెలా సాధ్యపడింది, మహారాజా! ఈ ఫిర్యాదులో మొదటినుంచీ మీతోబాటు నేనూ, అందరి సాక్ష్యం విన్నాను. కనకాంబరుడి శవాన్ని కూడా చూశాను,'' అన్నాడు మంత్రి.

మంత్రి మాటలకు రాజు చిరునవ్వు నవ్వి, ''ఉట్టినే చూడడం వేరు; పరిశీలించి చూడడం వేరు! జోగులు మునిగిపోతున్న కనకాంబరుడిని రక్షించేందుకు, అతడి జుట్టుపట్టుకున్నాననీ, అయినా అది తడిసివుండడంతో చేతినుంచి జారిపోయిందనీ, చెప్పాడు గదా?'' అని అడిగాడు.

''అవును, మహారాజా!'' అన్నాడు మంత్రి.

''జోగులుకు తల మీద ఏమాత్రం జుట్టులేదు. వాడిది పూర్తిగా బట్టతల,'' అన్నాడు రాజు.

రాజు మేధాశక్తికి మంత్రి అబ్బురపాటు చెందాడు.






పూర్వం సుపర్వగిరి మీద కేసరి అనే గొప్ప వానరుడు ఉండేవాడు. ఆ పర్వతం మీద అరవైవేలమంది వానరులు ఉండే వారు. కేసరి వారికి నాయకుడు.

ఒకప్పుడు ప్రభాస తీర్థంలో ఉండే మునులను శంఖమూ, శబలమూ అనే రెండు ఏనుగులు బాధిస్తూ ఉంటే, కేసరి ఆ రెండు ఏనుగులనూ చంపేశాడు. అందుచేత అతనికి కేసరి (సింహం) అనే పేరు వచ్చింది.

కేసరి మహాబలవంతుడూ, భాగ్యవంతుడూ అయి ఉండి కూడా, బ్రహ్మచర్యం అవలంబించి, మహా ఘోరమైన తపస్సు చేసి, అంతులేని శక్తులు సంపాదించాడు.

ఆ కాలంలో శంబసాధనుడు అనే రాక్షసుడు తపస్సు చేసి బ్రహ్మను మెప్పించి, మూడు లోకాలనూ జయించేటట్టు వరం పొంది, మునులనూ, సిద్ధులనూ, దేవతలనూ అమితంగా హింసించనారంభించాడు.

దేవతలందరూ కలిసి బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి, శంబసాధనుడు పెట్టే బాధలు భరించలేమని మొరపెట్టుకున్నారు. బ్రహ్మ వారిని కేసరి వద్దకు పంపాడు. దేవతలు కేసరి వద్దకు వెళ్ళి, అతన్ని ఆశీర్వదించి, శంబసాధనుడు పెట్టే బాధలన్నీ చెప్పుకుని, "బాబూ, ఆ దుర్మార్గుణ్ణుంచి నువ్వే మమ్మల్ని కాపాడాలి!" అన్నారు.

1. హనుమంతుడి జననం



"ఓహో! పాపం గదా అని ప్రాణాలతో వదిలిపెడితే, ఇదా దేవతలు చేస్తున్న ఆలోచన? నన్ను కోతి చేత ఎలా చంపిస్తారో నేనూ చూస్తాను! ఇంత కాలమూ చచ్చినట్టు పడిఉన్న వాళ్ళు నన్ను చంపటానికి చూస్తున్నారా? నా భుజబలం ఏమిటో ఈ దేవతలందరికీ చూపిస్తాను," అన్నాడు.

ఆ రాక్షసుడు ప్రళయకాలరుద్రుడిలాగా చేతిలో మెరిసే కత్తి పట్టుకుని కేసరి ఉన్న చోటికి అతి వేగంగా వచ్చి పడ్డాడు. అతని పెడబొబ్బలు విని కేసరి వద్ద ఉన్న దేవతలకు గుండెలు అవిసిపోయాయి. వాళ్ళు కొండగుహల్లోనూ, కేసరి చాటునా దాక్కునే ప్రయత్నాలు చేశారు.

"ఎక్కడికి పోతారు? మిమ్మల్నందరినీ ఒక్క దెబ్బతో చంపేస్తాను," అంటూ శంబసాధనుడు దేవతలను తరుముతూ ఉంటే, కేసరి అతనికి అడ్డం వెళ్ళి, "ఒరే, దుర్మార్గుడా! నాచేత చావటానికే ఇంతదూరం వచ్చావు. యుద్ధం చెయ్యి," అన్నాడు.

"ఛీ, ఛీ! కోతితో యుద్ధం చెయ్యటమా? నాతో యుద్ధం చెయ్యటానికి పరమశివుడే భయపడతాడు గద! ఒక్క క్షణంలో నీ సంగతి తేల్చేస్తా,"

ఇదే సమయంలో నారదుడు శంబసాధనుడి వద్దకు వెళ్ళి, "శుభమస్తు," అన్నాడు.

శంబసాధనుడు నారదుడికి నమస్కారం చేసి, "ఎక్కడి నుంచి వస్తున్నారు? ఏమిటి విశేషాలు?" అని అడిగాడు.

"హేమకూటం నుంచి వస్తున్నాను. అక్కడ ఇంద్రుడు మొదలైన దేవతలందరూ చేరి, నిన్ను చంపమని ఒక వానరుణ్ణి ప్రార్థిస్తూ ఉన్నారు. ఈ మాట నీతో చెప్పిపోదామనే వచ్చాను," అన్నాడు నారదుడు.

ఈ మాట వినగానే శంబసాధనుడు ఆజ్యంపోసిన అగ్నిలాగా మండిపడి,



అంటూ శంబసాధనుడు ఆవేశంతో కత్తి ఎత్తాడు.

ఇంతలో కేసరి పెద్ద రాయి ఎత్తి, రాక్షసుడి రొమ్ము అదిరేటట్టు కొట్టాడు. రాక్షసుడు కేసరి మీద ఒక గద విసిరితే, అది కేసరి రొమ్ముకు తగిలి పిండి అయిపోయింది. కాని కేసరి చలించలేదు. శంబసాధనుడు ఒక శూలాన్ని విసిరితే, కేసరి దాన్ని ఒడిసి పట్టుకుని, తన మోకాలికి పెట్టి విరిచేశాడు. అప్పుడు రాక్షసుడు కేసరిని కత్తితో కొట్టటానికి ముందుకు వచ్చాడు. కేసరి తన తోకతో రాక్షసుడి చేతి మీద కొట్టేసరికి కత్తి జారి కింద పడింది.

కిందపడిన కత్తి తీసుకోవటానికి శంబసాధనుడు ఒప్పుకోక, బాహుయుద్ధానికి సిద్ధపడ్డాడు. కాని కేసరి పిడికిలితో ఒక్క పోటు పొడిచే సరికి, ఆ రాక్షసుడు నెత్తురు కక్కుకుని చచ్చాడు. రాక్షసుడు చావటంతో దేవతల కష్టాలు తీరిపోయాయి.

దేవతలు కేసరితో, "ఇంకా ఎంత కాలం బ్రహ్మచారిగా ఉంటావు? ఇంక పెళ్ళి చేసుకుని గృహస్థువు అయిపో!" అని హెచ్చరించి వెళ్ళిపోయారు. కేసరి కూడా తనకు అనుకూలంగా ఉండే కన్య కోసం చూడసాగాడు.

బ్రహ్మదేవుడు సర్వాంగ సౌందర్యం గలిగిన అహల్య అనే కన్యను సృష్టించి గౌతముడు అనే మునికి భార్యగా ఇచ్చాడు. కొంతకాలానికి వారిద్దరికీ అంజన అనే కూతురు పుట్టింది.

అంజన పూర్వజన్మలో ఒక విద్యాధరుడి కూతురు. ఆమె గొప్ప గాయకురాలు. అందుచేత ఆమెకు సుకంఠి అనే పేరు వచ్చింది. ఆమె ఒకసారి తన చెలికత్తెలతో హిమాలయానికి వెళ్ళి, అక్కడ ఒక సరోవరంలో కొంతసేపు జలకాలాడి, ఒక చెట్టు కింద ఉండగా, అగ్నిహోత్రుడు అటు పోతూ ఆమెకు కనిపించాడు. అతన్ని చూసి సుకంఠి

పకపకా నవ్వింది. అగ్నికి కోపం వచ్చి, వచ్చే జన్మలో వానరుణ్ణి కనమని ఆమెను శపించాడు.

తరవాత కుంజరు డనే వానరుడు సంతానం కావాలని శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు కుంజరుడికి ప్రత్యక్షమై, "నాయినా, నీకు కొడుకులు పుట్టే యోగం లేదు. కాని నీకు ఒక కూతురు దొరుకుతుంది. ఆ చక్కని పిల్లకు నా అంశన లోకోత్తరుడైన కొడుకు పుట్టి, నీ వంశాన్ని ఉద్ధరిస్తాడు," అని చెప్పాడు.



తరవాత కుంజరుడు తనకు కూతురు ఎప్పుడు దొరుకుతుందో గదా అని ఎదురు చూస్తూండగా, ఒకనాడు గౌతముడు అంజనను అతని వద్దకు తెచ్చి, పెంచుకోమని ఇచ్చి, వెళ్ళిపోయాడు. శివుడి వరం ఇలా ఫలించింది. కుంజరుడి సంతోషానికి అంతులేదు.

అంజన త్వరలోనే తన అసలు తల్లి దండ్రులను మరిచిపోయి, కుంజరుణ్ణి తన తండ్రిగానూ, అతని భార్య అయిన వింధ్యావళిని తన తల్లిగానూ చూడ నారంభించింది. క్రమంగా ఆమెకు యుక్తవయసు వచ్చింది. కుంజరుడు ఆమెకు వివాహం చేసే ఆలోచన ఆరంభించాడు.

ఈ లోపల కేసరి అంజన అందం గురించీ, పాట గురించీ విని ఆమెను చూడటానికి బయలుదేరివచ్చి, ఆమె వనవిహారం చేస్తుండగా చూశాడు. ఆమె బంగారు శరీరచ్ఛాయా, అందమూ చూసి కేసరికి అమిత ఆశ్చర్యం కలిగింది. ఆమె తనను వరించేటట్టుంటే ఇంకేదీ జీవితంలో అవసరం లేదని అతనికి అనిపించింది.

అంజనకు కూడా కేసరిపైన అభిమానం కలిగింది. కాని ఆమె ఆ విషయాన్ని తన చెలికత్తెలకు తెలియనీయకుండా, వనవిహారం కట్టిపెట్టి వెంటనే ఇంటికి వచ్చేసింది.



కేసరి మర్నాడు తన ఆప్తులతో అంజన తనకు నచ్చిందని చెప్పి, ఆమెను తాను పెళ్ళాడే మార్గం ఏమిటని అడిగాడు.

"కుంజరుడు మనకు బంధువు కాదగిన యోగ్యుడే. అతన్ని మంచిగా అడిగి చూద్దాం. పిల్ల నియ్యనంటే బల ప్రయోగం చేద్దాం," అన్నారు కేసరి బంధుగణం.

తరవాత కేసరి పంపిన పెళ్ళిపెద్దలు కుంజరుడి వద్దకు వచ్చి, కేసరి ఉద్దేశం తెలిపారు. కేసరి అంతవాడు తనకు అల్లుడు అవుతున్నందుకు సంతోషించి, కుంజరుడు అంజనను అతనికి శాస్త్రోక్తంగా పెళ్ళి చేశాడు.

అయితే చాలా కాలం అంజనకు సంతానం కలగలేదు. సంతానం కోసరం అంజనా, కేసరీ ఎన్నో నోములూ, వ్రతాలూ చేశారు, కాని ఫలితం లేకపోయింది. చివరకు అంజన పిల్లల కోసం వాయుదేవుణ్ణి గూర్చి తపస్సు చేయ నిశ్చయించింది. కేసరి అందుకు సమ్మతించి, పుంజకస్థలం అనే చోట ఆమెను తపస్సు చెయ్యమన్నాడు. అలాగే అంజన వాయుదేవుణ్ణి ధ్యానిస్తూ తపస్సు ప్రారంభించింది.

చివరకు వాయుదేవుడు కరుణించి, ఒక దివ్యఫలాన్ని తెచ్చి, అంజన ముందు పెట్టి, వెళ్ళిపోయాడు. అంజన ఆ పండు తిని గర్భవతి అయింది. ఆమె తనలో గర్భచిహ్నాలు నానాటికీ ఎక్కువ అవుతూ ఉండటం చూసి ఆశ్చర్యపడి, ఆందోళన చెందింది.

అప్పుడు ఆకాశం నుంచి అశరీరవాణి ఇలా పలికింది:

"అమ్మాయీ, విచారించకు. ఒకప్పుడు శివుడు ఒక దివ్యఫలాన్ని వాయుదేవుడికి ప్రసాదించాడు. వాయుదేవుడు ఇప్పుడు దాన్ని నీకు ఇచ్చాడు. దాన్ని నువు తినటం చేత సాక్షాత్తూ ఆ శివుడే నీ గర్భంలో పెరుగుతున్నాడు. నీకు గర్భం కలగటానికి వాయుదేవుడు సహాయ

పడ్డాడు గనక ఆ కుర్రవాడు వాయుసుతుడుగా ప్రఖ్యాతి పొందుతాడు; మూడు లోకాలలోనూ అంతులేని కీర్తి సంపాదిస్తాడు.''



అశరీరవాణి ఇలా చెప్పిన మీదట వాయుదేవుడు అంజన ఎదట ప్రత్యక్షమై, ''అశరీరవాణి చెప్పినదంతా యథార్థం. విచారించక, నువ్వు వెళ్ళి నీ భర్తతో ఇలా జరిగిందనిచెప్పు,'' అని చెప్పి అదృశ్యమయ్యాడు.

అంజన కేసరి వద్దకు తిరిగి వచ్చి, అతనితో జరిగినదంతా చెప్పింది. కేసరి సంతోషించాడు.

ఒక సంవత్సరం గడిచిన మీదట అంజన ఒక పిల్లవాణ్ణి కన్నది. వెంటనే దేవదుందుభులు మోగాయి, పుష్పవర్షం కురిసింది. ఆ కుర్రవాణ్ణి చూసి కేసరి అపరిమితమైన ఆనందం పొంది, పండగ చేసుకున్నాడు.

పిల్లవాడికి ఆకలి తీరటానికి పళ్ళు తీసుకొద్దామని అంజన, తన బిడ్డను తమ పర్ణశాలలో చిగురుటాకుల పక్క మీద పడుకోబెట్టి, అడవికి వెళ్ళింది. కాని ఆ పిల్లవాడు ఆకలి మీద ఉండి, మెల్లిగా లేచి, తల్లి వెనకగా పర్ణశాల బయటికి వచ్చి, తూర్పు దిక్కుగా చూశాడు. అప్పుడే తూర్పు కొండమీది నుంచి ఎర్రగా పైకి వస్తున్న అందమైన సూర్యబింబం కనిపించింది.

దాన్ని చూసి ఆ కుర్రవాడు పండు అనుకుని, తెలియనితనం వల్ల దాన్ని పట్టుకునే ఉద్దేశంతో ఆకాశానికి ఎగిరాడు. అలా సూర్యుడి కేసి ఎగిరిపోతున్న ఆ కుర్రవాణ్ణి చూసి యక్షులూ, రాక్షసులూ, నాగులూ నివ్వెరపోయి, ఏదో ప్రళయం ముంచుకొస్తున్న దనుకున్నారు. ఇదేదో అపూర్వమైన కొత్త అవతారంగా వాళ్ళకు కనబడింది.

తన అనుచరులు ఆ కుర్రవాణ్ణి చూసి భయపడుతూ ఉంటే సూర్యుడు వారితో, ''ఇతడు ఈశ్వరతేజస్సుతో లోకాలను

రక్షించటానికి పుట్టిన ఆంజనేయుడు. గొప్ప బలశౌర్యాలు కలవాడు. అయితే కుర్రతనం చేత నన్ను చూసి, పండు అని భ్రమపడి, తినటానికి వస్తున్నాడు. భయపడకండి," అన్నాడు.

తనను చూసి పండు అని భ్రమపడి దగ్గిరికి ఎగిరి వచ్చే ఆంజనేయుణ్ణి చూసి సూర్యుడు ముచ్చటపడి, తన వేడిని తగ్గించేసుకున్నాడు. ఇంతలో ఆంజనేయుడు వచ్చి సూర్యుణ్ణి పట్టుకుని నోట్లో పెట్టుకుని, వేడి అనిపించి మళ్ళీ, బయటికి తెచ్చి, చేత్తో కొట్టి, తిట్టి, గొడవ పడసాగాడు.

ఆరోజు అమావాస్య. రాహువు సూర్యుణ్ణి పట్టుకునే రోజు. అందుచేత సూర్యుణ్ణి మింగటానికి రాహువు ఆ సమయంలో వచ్చాడు. రాహువును చూసి ఆంజనేయుడు పెద్ద పెడబొబ్బ పెట్టాడు. అది విని రాహువు భయకంపితుడై అతివేగంగా పారిపోయి, స్వర్గం చేరి, ఇంద్రుడి కొలువుకు వెళ్ళాడు.

ఇంద్రసభలో విద్యాధరులు ఇంద్రుడికి స్తోత్రపాఠాలు చదువుతున్నారు. తుంబుర నారదులు వీణలు వాయిస్తున్నారు. అప్సరసలు నాట్యం చేస్తున్నారు. ఇంద్రుడు చింతామణీపీఠం మీద వైభవంగా కూర్చుని ఉన్నాడు. రాహువు ఇంద్రుణ్ణి చేరి, "నీకేం? నువు హాయిగా ఆటలతో పాటలతో కాలం గడుపుతూ, ఉన్నావా!" అన్నాడు.

"అదేమిటి?" అన్నాడు ఇంద్రుడు.

"ఇవాళ పర్వదినం గదా, సూర్యుణ్ణి పట్టుకుందామని నేను వెళ్ళేసరికి, నాకు శత్రువుగా మరొక రాహువు దాపరించి సూర్యుణ్ణి పట్టేశాడు. సూర్యుణ్ణీ, చంద్రుణ్ణీ పట్టటానికి ఇంకో రాహువు ఉంటే నేను దేనికి?" అన్నాడు రాహువు.

ఇంద్రుడు నివ్వెరపోయి, "ఏమిటీ? ఇంకొకడెవడో వచ్చి సూర్యుణ్ణి పట్టాడా? ఏదీ, నా వెంట రా!" అని, ఐరావతాన్ని ఎక్కి, చేతిలో వజ్రాయుధాన్ని పట్టుకుని, వేగంగా బయలుదేరాడు.





# సేవాధర్మం

ఒక గ్రామంలో ఒక శ్రీమంతుడుండేవాడు. ఆయన వద్ద సేవకులుగా పనిచెయ్యటానికి చాలామంది మనుషులు వస్తూ ఉండేవాళ్ళు. కాని వాళ్ళు ఆయనను తృప్తిపరచలేక పోయేవారు. వాళ్ళలో సరిఅయిన సేవాతత్పరత లేదని ఆయనకు తోచేది. అందుచేత ఆయన తన సేవకులను ఎంతోకాలం ఉంచుకునేవాడు కాడు.

ఒకసారి ఆయనవద్దపనిచేస్తామనిఇద్దరు మనుషులు వచ్చారు. ఆయన వాళ్ళకు ఒక పరీక్ష పెట్టదలచి, చెరొక గంపాఇచ్చి, "మీరిద్దరూ ఇంటివెనక పూలతోటలో ఉండే బావికి వెళ్ళి, గంపనిండా నీళ్ళు తోడి తీసుకురండి, సాయంకాలందాకా పనిచేసినందుకు మీకు చెరొక రూపాయి ఇస్తాను," అన్నాడు.

ఇద్దరూ ఆశ్చర్యంతో ఒకరినొకరు చూసుకుని, బావి దగ్గిరికి బయలుదేరారు.

దారిలో పెద్దవాడు చిన్నవాడితో, "యజమాని బొత్తిగా మతిలేనివాడిలా కనిపిస్తున్నాడు. గంపలో నీళ్ళు నిలుస్తాయా?" అన్నాడు.

"ఆ మాట ఆయనకు తెలీదా ఏం?" అన్నాడు చిన్నవాడు.

ఇద్దరూ తిన్నగా బావి దగ్గిరికి వచ్చాక చెరొక చేదా తీసుకుని, గబగబా నీళ్ళు తోడి గంపల్లో పోశారు. పోసిన నీరు పోసినట్టుగానే గంపల్లో నుంచి కారిపోయింది.

చిన్నవాడు ఒక్కొక్క చేదే తోడి గంపలో పోస్తూంటే, పెద్దవాడు కూడా రెండు మూడు చేదలు పోశాడు. కాని, ఈ అర్థంలేని శ్రమ చెయ్యటం వాడికి చెప్పరాని చిరాకు వేసింది.

"గంపలో చుక్క కూడా నిలవదు. ఈ భాగ్యానికి నేను రెక్కలు విరుచుకో

పటం కూడా దేనికి? యజమాని లాగే నీకు కూడా మతిపోతే సాయంకాలందాకా రెక్కలు హూనం చేసుకో. నా వల్లకాదు,'' అంటూ పెద్దవాడు పోయి ఒక చెట్టు నీడన కూర్చున్నాడు.

చిన్నవాడు మటుకు సాయంకాలందాకా చేదతో నీళ్ళు తోడి గంపలో పోస్తూనే వచ్చాడు. సాయంకాలానికి బావిలో నీరు అడుగంటి, చేదలోకి నీళ్ళతోబాటు మట్టి కూడా రాసాగింది.

సూర్యాస్తమానమయింది. చిన్నవాడు చేద కిందపెట్టి తట్ట పైకెత్తాడు. అందులో ఏదో తళతళా మెరిసింది. తీసి చూస్తే బంగారు ఉంగరం. చిన్నవాడు ఉత్సాహంతో ఆ ఉంగరాన్ని తీసుకుని యజమాని దగ్గిరికి బయలుదేరాడు. పెద్దవాడు కూడా వాడి వెంట వెళ్ళాడు.

యజమాని చిన్నవాడిచ్చిన ఉంగరం అందుకుని, ''ఇది దొరుకుతుందనే మీచేత బావిలో నీళ్ళన్నీ తోడించాను. ఇదుగో నీ కూలి,'' అంటూ చిన్నవాడికి రూపాయి ఇచ్చి, పెద్దవాడితో, ''నువు కూడా పని చెయ్యటానికే వచ్చావనుకున్నానే? రెండు బొక్కెనలు తోడి అంతటితో ఆపేశావేం? నీకు జీతం డబ్బుల మీద ఆశలేదా?'' అన్నాడు.

''గంపలో నీళ్ళు పొయ్యమన్నారు. ఎన్ని చేదలు పోసినా గంప నిండదుగదా అని మానేశాను,'' అన్నాడు పెద్దవాడు పిచ్చి మొహం వేసి.

''నేను గంప నిండటానికి నీళ్ళు పొయ్యమన్నానని ఎందు కనుకున్నావు? చెప్పిన పని చేసి కూలి పుచ్చుకోవటమే నీ వంతు గాని, ఆ పని ఫలితం నాది గద! దాన్ని గురించి ఆలోచించవలిసినవాణ్ణి నేనై ఉండగా నీకు బెంగ దేనికి? నీలో సేవా ధర్మం లేదు. నువు పనికి పనికిరావు.'' అని యజమాని వాడికి కాసిని డబ్బులిచ్చి పంపేసి, చిన్నవాణ్ణి పనిలో పెట్టుకున్నాడు. వాడు యజమాని మెప్పు సంపాదించే టట్టు చాలాకాలం పనిచేసి, బాగుపడి, పైకి వచ్చాడు.





# వల్లభుడి జబ్బు

వల్లభుడనేవాడు పొరుగూరు వెళుతూ, అడవిమార్గం పట్టి దారి తప్పాడు. అప్పుడు వాడొకచోట నిద్రిస్తున్న నడివయస్కుణ్ణి కాటు వేయబోతున్న విషసర్పాన్ని చూశాడు. క్షణం కూడా జాప్యం చేయకుండా, వాడాపామును వెనుకనుంచి తోక పట్టుకుని దూరంగా విసిరివేశాడు.

అలికిడికి నడివయస్కుడు లేచి జరిగింది తెలుసుకుని, ''నాయనా! సమయానికి నా ప్రాణాలు కాపాడి రక్షించావు. ప్రత్యుపకారంగా నీకు, నా దగ్గిరున్న మాయసంచినిస్తాను. అది నీవు కోరినప్పుడల్లా ఆహారాన్నిస్తుంది. దాన్ని నీ అవసరాలకే వాడుకుంటూ, దుర్వినియోగం చేయకుండా సుఖంగా జీవించు,'' అన్నాడు.

వల్లభుడాశ్చర్యంగా, ''ఇటువంటి మాయసంచి మీకెక్కడిది?" అనిఅడిగాడు.

''నేనొక భాగ్యవంతుణ్ణి. నా చుట్టూ చేరిన వారందర్నీ, నా మేలు కోరినవారని భ్రమించి వున్నదంతా పోగొట్టుకున్నాను. నా ఆస్తిని కాజేసిన దుర్మార్గులు, నన్ను ఇంట్లోంచి వెళ్ళగొట్టారు. నేను న్యాయాధికారికి ఫిర్యాదు చేశాను. ఆ దుర్మార్గులు న్యాయాధికారికి లంచమిచ్చి, నాకు దేశ బహిష్కరణ విధించేలా చేశారు. నేను ఈ అడవి చేరుకుని, ఒక మహాత్ముడి కంటబడ్డాను. ఆయన నా దుస్థితికి జాలి పడి, నేను చేసిన పుణ్యాన్నొక మాయ సంచిగా మార్చి నాకిచ్చాడు. ఆ సంచిని అవసరానికి మాత్రమే వాడుకుంటూ, మళ్ళీ మనుషుల మధ్యకు వెళ్ళడం ఇష్టం లేక, ఇక్కడే కాలం గడుపుతున్నాను. ఇన్నాళ్ళకు మనుషుల్లో ఒక మంచివాణ్ణి చూశాను. నాకెంతో తృప్తిగా వున్నది,'' అన్నాడు నడివయస్కుడు.

"వసుంధర"



''ఈ మాయసంచిని నాకిస్తే, మీకెలా గడుస్తుంది?" అన్నాడు వల్లభుడు బాధగా.

''ఇంతకాలం నాకు అపకారం చేసిన వాళ్ళకు కూడా డబ్బిచ్చి సాయపడ్డాను. ఇంతకాలానికి నాకు ఉపకారం చేసిన మొదటి మనిషివి నువ్వు. నీకు ప్రత్యుపకారం చేయకుండా వుండలేను. నన్ను గురించి ఆలోచించకు. నాకెలాగో అలాగా రోజులు గడుస్తాయి,'' అన్నాడు నడివయస్కుడు.

''అయితే మీరూ నాతో వచ్చి వుండండి. నాకూ ఎవ్వరూ లేరు," అన్నాడు వల్లభుడు.

నడివయస్కుడు దీనికంగీకరించాడు. వాళ్ళిద్దరూ కలిసి అతికష్టం మీద సరైన దారి పట్టుకుని, తిరిగి వల్లభుడి గ్రామం చేరుకున్నారు.

కొంతకాలం బాగానే గడిచింది. మాయసంచి ధర్మమా అని వల్లభుడికి తిండికి లోటులేదు. అయితే, వాడికది తృప్తిగా లేదు. బాగా డబ్బు సంపాదించి మేడలు కట్టి వైభవంగా జీవించాలని వాడి కోరిక. ఆ కోరికను వాడు నడివయస్కుడికి చెప్పాడు.

''అందుకు నువ్వు స్వయంగా కష్టపడాలి. మాయసంచిని దుర్వినియోగం చేయకు!'' అని హెచ్చరించాడు నడివయస్కుడు.

''ఆ సంచిని దుర్వినియోగం చేస్తే ఏమవుతుంది?'' అని అడిగాడు వల్లభుడు.

''నీకేమీ కాదు. నీ బుద్ధిని మాయసంచి తప్పుదారిపట్టిస్తే, ఆ మాయసంచిని నీకిచ్చినందుకు తప్పు నాదవుతుంది. నేనే అనుభవిస్తాను,'' అన్నాడు నడివయస్కుడు.

భాగ్యవంతుడు కావాలన్న కోర్కెను చంపుకోలేక, వల్లభుడు మాయసంచితో భోజనం తయారుచేసి అందరికీ అమ్మసాగాడు. పెట్టుబడి లేకుండా అన్నం వస్తుండడంవల్ల, త్వరలోనే వాడికి మంచి లాభాలు రాసాగాయి.

ఈలోగా నడివయస్కుడు ఊళ్ళో చాలామంది ఇళ్ళలో కష్టపడి పని చేయసాగాడు. వల్లభుడెంత వారించినా ఆయన వినలేదు. తను చేసిన పని కాయన ఎవరి వద్ద నుంచీ, ప్రతిఫలం తీసుకునేవాడు కాదు.

ఇందుకు ఎవరైనా ఆశ్చర్యపడి అడిగితే, "బాబూ, నేను చేసిన పాపానికిది ప్రతిఫలం. ఇలా ఊరికే పని చేయకపోతే, నేను నరకానికి పోతాను," అనేవాడు.

ఊళ్ళోవాళ్ళు కొందరు వల్లభుణ్ణి, "నీవింత బాగా సంపాదిస్తున్నావు కదా! నీతోపాటుండే ఆ పెద్దాయన అంత కష్టపడి పని చేస్తూంటే చూస్తూ వూరుకుంటావేం?" అని మందలించారు.

వల్లభుడు, నడివయస్కుడితో ఒక నాడు, "నీ మూలంగా నాకు చెడ్డపేరు వస్తున్నది. నువ్వు వాళ్ళావీళ్ళ ఇళ్ళలో పని చేయడం మానుకో," అన్నాడు.

నడివయస్కుడు వాడి మాట లెక్క చేయకుండా, "నీ దగ్గిరున్న మాయసంచి, నా పుణ్యానికి ప్రతిఫలం. నా పుణ్యమున్నంతకాలమే దాని మహిమ వుంటుంది. ఆ పుణ్యం తగ్గిపోకుండా, నేనీ పని చేస్తున్నాను. నువ్వు మాయసంచిని బాగా ఎక్కువగా వాడుతున్నావు కదా!" అన్నాడు.



ఎప్పుడైతే నడివయస్కుడి పుణ్యం, తనకు పనికి వస్తుందని తెలిసిందో, ఆ తర్వాత వల్లభుడిక మాట్లాడలేదు. వాడు బాగా ధన సంపాదనలో పడ్డాడు. ఏడాది తిరక్కుండా మేడకట్టి, ధనవంతుల ఇంటి పిల్లను పెళ్ళి చేసుకున్నాడు.

ఉన్నట్టుండి వాడికి జబ్బు చేసింది. పేరు మోసిన వైద్యులు వచ్చివాణ్ణిపరీక్షించి చూసి, "ఈ జబ్బు మాకు అంతుబట్టడం లేదు. ఏ యోగినైనా దర్శించడం మంచిది," అని సలహా యిచ్చారు.

వల్లభుడి భార్య వాణ్ణి బాగా పేరున్న, ఒక యోగి దగ్గిరకు తీసుకు వెళ్ళి చూపించింది. యోగి వాణ్ణి చూస్తూనే, "శ్రమపడ

కుండా సుఖాలనుభవిద్దామనుకున్నావు. శరీరశ్రమ అవసరం లేకుండానే, నీకు సంపద పెరుగుతున్నది. అందువల్ల నీకు శరీరారోగ్యం ఎందుకు ? అందుకే మంచం పట్టావు,'' అన్నాడు.

''అదేమిటి, స్వామీ! మరి నా సంపదను నేను అనుభవించవద్దా ?'' అన్నాడు వల్లభుడు.

''కష్టపడేవారికే అనుభవించే యోగం వుంటుంది. అదీకాక నువ్వు ఒకరి శ్రమను ఉపయోగించుకుంటున్నావు. ఆ పాపం నిన్ను వేధిస్తున్నది,'' అన్నాడు యోగి.

''నావద్ద ఒక మాయసంచి వున్నది. అది ఒకాయన నాకు మనస్ఫూర్తిగా యిచ్చాడు. ఆ సంచిని నేను ఎక్కువగా ఉపయోగిస్తే, ఆ పాపం ఆయనదే కానీ నాది కాదని ఆయనే చెప్పాడు,'' అన్నాడు వల్లభుడు.

''మూర్ఖుడా! నీ పాపాన్నాయన స్వీకరించి వుండవచ్చు. నీ కారణంగా అంతులేని శ్రమకు గురైన ఆయనకు, నీమీద కోపం లేకపోవచ్చు. కానీ ఆయన పడే శ్రమంతా పాపంగా మారి నీకు చుట్టుకున్నది. ఇకనైనా బుద్ధి తెచ్చుకుని, ఆయనకు సేవలు చేస్తూ, అత్యాశ మాని బ్రతుకు. నీ జబ్బు తగ్గుతుంది. సుఖపడతావు,'' అన్నాడు యోగి.

దానితో వల్లభుడికి తన తప్పు అర్థమై, యోగికి నమస్కరించి, తన పద్ధతిని మార్చుకుంటానని మాట యిచ్చాడు. ఆ వెంటనే వాడి జబ్బు తగ్గిపోయింది.

ఆ తర్వాత నుంచి వల్లభుడు మాయ సంచిని, తన ఇంటి అవసరాలకు మాత్రమే ఉయోగించుకుంటూ, ధన సంపాదనకు స్వయంకృషి మీద ఆధారపడ్డాడు. నడి వయసుక్కడిని ఎక్కడా పని చెయ్యనివ్వకుండా, తనే ఆయనకు పరిచర్యలు చేస్తూ కన్నతండ్రిలా చూసుకున్నాడు.

క్రమంగా వల్లభుడి సంపద పెరగసాగింది. వాడు కలకాలం ఆయురారోగ్యాలతో, సకల సంపదలూ అనుభవిస్తూ వైభవంగా జీవించాడు.





# అదృష్టదేవత

పూర్వం చీనాలోని ఒక గ్రామంలో వాంగ్ అనే పేద రైతు ఉండేవాడు. ఊహ తెలిసే నాటికి అతనికి నా అన్నవారెవరూ లేరు; తండ్రి తాతల తాలూకు ఎకర మున్నర పొలం మాత్రం ఉన్నది. వాంగ్ అందులో వ్యవసాయం చేస్తూ, తన ఖర్చులకు పోగా కొంత మిగుల్చుతూ వచ్చాడు.

వాంగ్ పొలాన్ని ఆనుకుని కొంత బీడు ఉండేది. ఆ బీడు కొనుక్కొని, తన పొలంలో కలుపుకుని వ్యవసాయం సాగించాలని వాంగ్‌కు ఎంతో కోరికగా ఉండేది.

ఆ బీడు ఒక వ్యాపారిది. వ్యాపారి మంచి ఆస్తిపరుడు. అనేక మందికి అప్పులు ఇచ్చి, వారి ఆస్తులు రాబట్టుకుని ఆయన ధనవంతుడయ్యాడు. ఆ బీడు కూడా అలా సంపాదించినదే.

ఒకనాడు వాంగ్ వ్యాపారిని కలుసుకుని ఆ బీడును తాను కొంటాననీ, దాని ఖరీదు చెప్పమనీ అడిగాడు. బీడు కోసం వాంగ్ తహతహ పడుతున్నాడనీ, అది వాంగ్ పొలంలో కలుస్తుందనీ, బీడును సుక్షేత్రంగా చేసుకునే శక్తి వాంగ్‌కు ఉన్నదనీ గమనించి వ్యాపారి బీడు ధర చాలా హెచ్చుగా చెప్పాడు.

కాని వాంగ్ దగ్గిర అంత డబ్బులేదు; వ్యాపారి అడిగిన దానిలో సగమే ఉన్నది. వ్యాపారి అది తీసుకుని, మిగిలిన దానికి వాంగ్ చేత ఋణపత్రం రాయించుకున్నాడు. తనకు భూమి అమ్మినట్టు పత్రం రాసి ఇయ్యమని వాంగ్ అడిగాడు. బాకీ పూర్తిగా తీరగానే క్రయ పత్రం రాసి ఇస్తానని వ్యాపారి చెప్పాడు.

బీడు సంపాదించుకున్న ఆనందంతో వాంగ్ తన ఇంటికి వెళ్ళిపోయాడు.

చీనా జానపద కథ

కొంత కాలం గడిచింది. తన నుంచి కొన్న బీడులో వాంగ్ ఎలా వ్యవసాయం చేస్తున్నాడో చూడటానికి వ్యాపారి ఆ బీడు కేసి వెళ్ళాడు. వాంగ్ నాగలితో బీడు దున్నుతూ ఉండటం వ్యాపారికి కనపడింది. ఆ బీడును వ్యాపారి గుర్తించలేక పోయాడు. అది పూర్తిగా మారిపోయింది.

వ్యాపారి చూస్తూండగానే నాగలికి ఏదో అడ్డు తగిలి ఆగిపోయింది. వాంగ్ దున్నటం ఆపి, పారతో తవ్వసాగాడు. వ్యాపారి గబగబా అక్కడికి వెళ్ళాడు. వాంగ్ తాను తవ్విన గుంట నుంచి రెండు బంగారు కూజాలు పైకి తీశాడు అవి చాలా పాతకాలం నాటివి. అదృష్టదేవత ఎవరికైనా సహాయం చేయదలచుకుంటే బంగారు కూజాల రూపంలో వారిని చేరుకుంటుందని చీనాలో ఆ కాలంలో ఒక నమ్మకం ఉండేది. ఈ మాట వాంగ్‌కు తెలీదు గాని వ్యాపారికి తెలును. అందుచేత ఆయన ఆ కూజాలు తనవే నన్నాడు. కాని అందుకు వాంగ్ సమ్మతించక పోయే సరికి, ఇద్దరూ కలిసి న్యాయాధికారి వద్దకు పోవలసి వచ్చింది.

తాను వ్యాపారి నుంచి బీడు కొని దున్నుతూ ఉండగా కూజాలు దొరికాయని వాంగ్ న్యాయాధికారికి విన్నవించుకున్నాడు.

వెంటనే వ్యాపారి న్యాయాధికారితో, "అయ్యా, వీడు మోసకారి. అసలు



ఆ బీడు భూమి నాదే. దాన్ని వీడికి నేను అమ్మనే లేదు. వీడి చేత బీడు దున్నిస్తూ ఉండగా ఇవి దొరికాయి. అదృష్ట దేవత ఈ రూపంలో నన్ను చేరింది. వాంగ్ దురాశతో ఇవి తనవి అంటున్నాడు,'' అన్నాడు.

''అయ్యా, ఈ బీడు నేను కొనుక్కున్నాను,'' అన్నాడు వాంగ్.

''అందుకు రుజువు ఏమిటి?'' అని న్యాయాధికారి అడిగాడు.

వాంగ్ తెల్లబోయి, జరిగిన దంతా వివరంగా న్యాయాధికారికి చెప్పాడు.

న్యాయాధికారికి వ్యాపారి దుర్బుద్ధి అర్థమయింది. కాని ఆయన పైకి, ''అదృష్టదేవత వ్యాపారిని వరించింది. అతని బీడులో దొరికిన కూజాలు అతనివే అవుతాయి,'' అంటూ, అందరూ వింటూండగా తీర్పు చెప్పి, కూజాలను వ్యాపారికి ఇచ్చాడు.

వ్యాపారి సంతోషంతో ఇంటికి పోయాడు.

వాంగ్ న్యాయాధికారితో, ''అయ్యా, కూజాలు పోతే పోయాయి. నా బీడు భూమి అయినా నాకు ఇప్పించండి,'' అన్నాడు.

''నువు ధైర్యంగా ఉండు. అంతా నీకు అనుకూలంగానే జరుగుతుంది,'' అని న్యాయాధికారి వాంగ్‌ను పంపేశాడు.

మర్నాడు ఉదయం న్యాయాధికారి కొంత మంది భటులను వెంటబెట్టుకు



పోయి, వ్యాపారిని పట్టుకున్నాడు. ఈ వార్త క్షణంలో గ్రామమంతా పాకి, అనేక మంది అక్కడ చేరారు.

న్యాయాధికారి వాళ్ళతో, ''ప్రజలారా, ఈ వ్యాపారి నిన్న తన బీడులో ఈ కూజాలు దొరికినట్టు అబద్ధం ఆడాడు. నిజానికి ఇవి చక్రవర్తిగారి ఖజానాలోవి. నిన్న రాత్రి రాజుగారి చారులు నాకు ఈ వార్త అందజేశారు. కూజాలు తస్కరించిన వాణ్ణి బంధించమని చక్రవర్తిగారి ఆజ్ఞ. అందుచేత ఈ వ్యాపారిని బంధిస్తున్నాను. ఇతనికి దారుణమైన శిక్ష పడుతుందని నాకు తోస్తున్నది,'' అంటూ వ్యాపారి కేసి చూశాడు.

ఈ మాటలు వినగానే వ్యాపారికి గుండె ఆగినంత పని అయింది. అతను భయంతో వణికిపోతూ న్యాయాధికారితో, ''అయ్యా, నిన్న బుద్ధి గడ్డి తిని తమతో అబద్ధం చెప్పాను. నేను ఏ పాపమూ ఎరగను. ఆ బీడుభూమి ఇప్పుడు నాది కూడా కాదు. దాన్ని వాంగ్‌కు ఎప్పుడో అమ్మేశాను. వాడే ఆ కూజాలను ఆ భూమిలో దాచి, నిన్న పైకి తీసినట్టున్నాడు. వాంగ్‌నే శిక్షించండి,'' అన్నాడు.

''అందుకు రుజువు ఏమిటి?'' అని న్యాయాధికారి వ్యాపారిని అడిగాడు.

వెంటనే వ్యాపారి తనకు వాంగ్ రాసి ఇచ్చిన రుణపత్రాన్ని తెచ్చి చూపాడు.

అందుకోసమే వేచి ఉన్న న్యాయాధికారి ఆ పత్రాన్ని వాంగ్‌కు ఇప్పించి, లోపలి నుంచి కూజాలు తెప్పించి, ''ప్రజలారా, ఈ వ్యాపారి వాంగ్ అమాయకత్వాన్ని ఆసరా చేసుకుని అతన్ని మోసం చెయ్యదలచాడు. కాని అతని మాటలను విశ్వసించలేక నేను ఈ నాటకం ఆడాను. ఈ కూజాలు చక్రవర్తిగారివి కానే కావు. వాటికోసం చక్రవర్తిగారు వెతికిస్తున్నారన్నది కూడా అబద్ధమే. న్యాయంగా ఈ కూజాలు వాంగ్‌కు చెందుతాయి. అదృష్టదేవత వరించింది వాంగ్‌ను!'' అంటూ ఆ కూజాలను వాంగ్‌కు ఇచ్చేశాడు.





## లోతైన గుహ!

ఫ్రాన్స్‌లోని పైరినీస్‌లో 1951 వ సం॥ కనుగొనబడిన పైరీ సెయింట్ మార్టిన్ గుహ ప్రపంచంలో కెల్లా లోతైనది. ముఖ ద్వారం నుంచి ఇది 4,364 అడుగుల లోతు వరకూ వెళుతుంది!





## భాగస్వాములు

ఆఫ్రికాలోని ఖడ్గమృగాల వీపుల మీద 'ఆక్స్‌పెకర్' అనే ఒకరకం పిట్టలు కూర్చుని వాటి ఒంటి మీది క్రిములనూ, పురుగులనూ పట్టి తింటూ వుంటాయి. దీనికి ప్రత్యుపకారంగా దూరంగా ఏదైనా ఆపద వస్తుందని తెలియగానే పిట్టలు గట్టిగా అరచి, ఖడ్గమృగాలను హెచ్చరిస్తాయి.

## మెరుపులు

ప్రపంచంలో ఎప్పుడూ ఎక్కడో ఒకచోట మెరుస్తూనే వుంటుంది గంటకు సరాసరి 3,60,000 సార్లు మెరుపులు మెరుస్తూ వుంటాయని ఒక అంచనా!





FIRE ENGINE (FRICTION)



SUPER DUMPER (FRICTION)



WRECKER (FRICTION)



ZAP GUN (ELECTRONIC)



HELICOPTER (WIND-UP)

SAMMO

In collaboration with Sammo Corporation, S.Korea

CHANDAMAMA TOYTRONIX

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1990 ఆగస్టు నెల సంచికలో ప్రకటింపబడును.



M. C. Morabad



G. Prabhakar

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూన్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: పోషణకోసం సంగీతం! రెండవ ఫోటో: రక్షణకోసం తూణీరం!

పంపినవారు: ఎ. సౌమ్య, చిక్కడపల్లి, హైదరాబాదు—20.

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.